# విస్‌డమ్

## అవార్డులసభ

1993 డిసెంబరు 17వ తేదీ

సాయంత్రం గం.5.30 లకు

'నారదగాన సభ'లో

మద్రాసు-600018

:అధ్యక్షులు:

ఆనరబుల్ జస్టిస్ శ్రీ ఎస్.నటరాజన్

(భారత సుప్రీమ్ కోర్టు, మాజీ న్యాయాధిపతి)

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కరణ:

డా॥ పి.భానుమతీ రామకృష్ణ

(తమిళనాడు ప్రభుత్వ సంగీత కళాశాల: మాజీ డైరక్టరు మరియు ప్రిన్సిపాల్)

సలహాసంఘ సభ్యులచే విజేతలకు

'విస్‌డమ్' అవార్డుల

# విస్‌డమ్

## అవార్డుల సభ

1993 డిసెంబరు 17వ తేదీ

సాయంత్రం గం.5.30 లకు

'నారదగాన సభ'లో

మద్రాసు-600018

:అధ్యక్షులు:

ఆనరబుల్ జస్టిస్ శ్రీ ఎస్.నటరాజన్

(భారత సుప్రీమ్‌కోర్టు, మాజీ న్యాయాధిపతి)

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కర్తలు:

డా॥ పి.భానుమతీ రామకృష్ణ

(తమిళనాడు ప్రభుత్వ సంగీత కళాశాల:
మాజీ డైరక్టరు మరియు ప్రిన్సిపాల్)

సలహాసంఘ సభ్యులచే విజేతలకు

'విస్‌డమ్' అవార్డుల

## ధ్యానం

### అజ్ఞానం వల్ల జరిగే పొరపాట్లు



జేమ్స్ ఎలెన్

కోపం, రోషం, ఆగ్రహాలతో ఎవడి మనస్సు దహించుకుపోతుందో, అతడు శాంతిని గుర్తించలేడు, నిజాన్ని గ్రహించలేడు తన హృదయం నుంచి ఆగ్రహాన్ని బహిష్కరించినవాడు గుర్తిస్తాడు, అవగాహన చేసుకుంటాడు

తన సొంత హృదయంలో నుంచి చెడుని లేక దుర్మార్గాన్నీ ఎవడైతే వెలుపలికి తెస్తాడో, అతడు ఇతరులు కూడా చెడుని విసర్జించేందుకు కారణభూతుడవుతాడు దాని మూలం మరియు స్వబావం గురించి అతనికి విశదం అవుతుంది అది అజ్ఞానంవల్ల చేసిన పొరపాట్ల వ్యక్తీకరణమేనని తెలుసుకుంటాడు అవగాహన పెరిగిన కొద్దీ అపరాదం (తప్పు) అసాధ్యమౌతుంది అపరాదం చేసినవాడు అవగాహన చేసుకో

(మిగతా 4 వ పే

## సంపాదకుని పేజీ

### మనశ్శక్తి పెంచు, భయాన్ని త్రెంచు

ప్రమాదం లేక హాని లేదా హానిని గురించిన ఆలోచనల ప్రేరేపణ ఫలితంగా ఏర్పడే బాదాకరమైన బావావేశమే - బయం (శంక) అది అపాయం లేక విపత్తుకు ప్రతికూలంగా నిల్చి కాపాడుతుంది జీవితం ప్రమాదంలో పడినప్పుడు సత్వరచర్య తీసుకునేందుకు పురికొల్పుతుంది ఒక మనిషి జారి, జన సమ్మర్ధం కల నడిరోడ్డు మీద పడిపోగానే, ఒక ట్రక్కు (లారీ) లేదా మరేదో వాహనం క్రింద పడిపోతానేమో అనే బయం అతడు సత్వరచర్య తీసుకునేందుకు దోహదం చేస్తుంది ఏదో ఒక విధంగా అతడు పైకి లేచి, బద్రత కోసం పరుగు తీస్తాడు

బయాలు రెండు విదాలు - హేతుబద్ధమైన బయం మరియు 'ఫోబియా' అనబడే విద్వేషం లేక విపరీత భయం

**శుభాకాంక్షలు!**

**పాఠకులకూ, ఏజంట్లకూ, ప్రకటనదారులకూ హార్దికమైన నూతన సంవత్సర శుభాకాంక్షలు.**

**-సంపాదకుడు**

ఒక సంపన్నుడు తన కంఠంలో గడ్డ (వాపు) ఉన్నట్లు కనుగొన్నాడు అతడు స్వల్పంగా కలత చెందాడు సలహా కోసం వైద్యుని వద్దకు వెళ్ళాడు హేతుబద్ధమైన భయానికి ఇదొక ఉదాహరణ ఫోబియాలు - వివేకం లేని, అతిశయమైన భయాలు వాస్తవిక పరిస్థితి కంటే - కొన్ని సందర్భాలలో ఇవి హెచ్చు పాళ్ళలో ఉంటాయి మానవ మస్తిష్కాన్ని బాధించే ఫోబియాలకు ఉదాహరణలు ఒక సాలెగూడులోని సాలెపురుగు నుంచి పారిపోవటం లేదా బోనులోని ఎలుకను చూసి పారిపోవటం



బాల్యంలోని సంఘటనలు ఒక మనిషిలో ఫోబియాలు ఏర్పడేందుకు దారి తీస్తాయి తన స్వంత ప్రతిమాతాల దిగ్భ్రమ రాబోయే కొన్నేళ్ళ వరకు అతని అంతశ్చేతనలో కొనసాగుతూనే ఉంటుంది

మనం నిర్వర్తించేందుకు భయపడే పనినే చేసి - పిల్లలుగా - మనం మనలోని కొన్ని భయాలను జయిస్తాము బైసికిల్ త్రొక్కటం లేదా కారు నడపటం నేర్చుకున్నప్పుడు భయం పతనమౌతుంది భయానికీ, ఉద్రేకానికీ మధ్య ఉన్న దూరపు లంకె - కొందరు వ్యక్తులు భయపడే అవే వస్తువులు ఇతరులకు అత్యధిక మైన సంతోషాన్ని ఎందుకు కలిగిస్తాయో సాక్షికంగా విశదపరుసుంది

పర్వతారోహణ - ఒక అపాయకరమైన సాహస కృత్యం ప్రాణాలు పోగొట్టుకునే అవకాశం ఎక్కువ ఒక పర్వతారోహక బృంద సభ్యులు ఈ ప్రయత్నం చేసేందుకు ఎందువల్లనో విముఖత చూపారు కానీ అసాధారణ కార్యం ఏదో చేయాలనే మండే కోరిక వారి భయాన్ని దాస్తున్నది

భయాన్ని జయించేందుకు మానవునకు మనశ్శక్తి సహాయపడుతుంది మనశ్శక్తిని అభివృద్ధి చేసుకుని సమస్యల్ని భయం లేకుండా ఎదుర్కోవాలి

ఫోబియాలను అధిగమించాలంటే ప్రవర్తన (నడవడి) చికిత్స మంచిది అతడు భయపడే విషయాన్ని రోగికి క్రమేణా వెల్లడి చేయడం ద్వారా అది రోగ లక్షణానికి చికిత్స చేస్తుంది భయం యొక్క అర్థం అవగాహన చేసుకునేందుకు, ఉద్రేక ఉపశమనం కలిగించేందుకు ఒక వ్యక్తికి విశ్లేషాత్మక మానసిక (మనస్తత్వ సంబంధమైన) చికిత్స తోడ్పడుతుంది

(3 వ పేజీ తరువాయి)

లేదు, అవగాహన చేసుకున్నవాడు అపరాధం చేయలేడు

తాము హాని చేయగలమని అజ్ఞానంతో ఊహించుకునేవారి పట్ల ఒక నిర్మలమైన, స్వచ్ఛమైన వ్యక్తి తన హృదయ సౌకుమార్యాన్ని ప్రదర్శిస్తాడు తన పట్ల ఇతరుల పొరపాటు వైఖరి అతనికి ప్రయాస కలిగించదు అతడి హృదయం కరుణ, ప్రేమలకు ఆశ్రయంగా ఉంటుంది

# పాడిపంటల, పసిడిరాసుల "పొంగల్"

జేసుదాస్

కులమత భేదాలు పాటించకుండా తమిళులందరూ జరుపుకునే 'పంటల పండుగ' "పొంగల్" దీన్ని 'తమిళదినం' అని కూడా పిలుస్తారు తమిళనాడులో ప్రధానమైన వృత్తి-వ్యవసాయం కనుక 'పొంగల్' 'రైతుల దినం'గా కూడా ప్రసిద్ధి చెందింది




మనకు అపారంగా పంటలను అందిస్తున్న ఆ భగవంతునికి కృతజ్ఞతలు ప్రకటించుకోవటం - ఒక విధంగా పొంగల్ వేడుకల ఉద్దేశం తయ్ (జనవరి 11 నుండి 13 లోగా) మాసం మొదటి రోజున పొంగల్ ఉత్సవాలు ప్రారంభమవుతాయి ఇవి మూడు రోజులపాటు కొనసాగుతాయి

తమకు చక్కని పంట ఇచ్చినందుకు, దున్నేందుకు సారవంతమైన నేలను ఇచ్చినందుకు, జంతువులకు, మొక్కలకు జీవం, ఉత్సాహం ఇచ్చే సూర్యభగవానుని, జీవించేందుకు అవసరమైన నీటిని సమకూర్చినందుకు - మొదటి రోజున తమిళులు ప్రత్యేక పద్ధతిలో భగవంతుణ్ణి ఆరాధిస్తారు అందువల్ల ఇది పవిత్రంగా జరిపే ఒక ఆధ్యాత్మిక ఉత్సవం కూడా అవుతుంది

ఆ రోజున తమిళ గృహాలన్నీ పుష్పాలతో, మామిడి తోరణాలతో అలంకృతమౌతాయి తీపి చేర్చి కొత్త బియ్యంతో వండిన అన్నాన్ని 'తీపి పొంగలి' లేక 'చక్కెర పొంగలి' అని

## విస్డమ్ పాత కాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూలై '85, ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90, ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91, జనవరి '92 నుంచీ డిసెంబరు '92, జనవరి 93 నుంచీ జూన్ '93 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7 50 లు, 1985 కాపీల వెల రూ 6 50 లు; 1986 కాపీల వెల రూ 10 50 లు; 1987 కాపీల వెల రూ 10 00 లు, 1988 కాపీల వెల రూ 18 75 లు, 1989 కాపీల వెల రూ 24 50 లు; 1990 కాపీల వెల రూ 25 50 లు; 1991 కాపీల వెల రూ 26 50 లు, 1992 కాపీల వెల రూ 33 00 లు, 1993 కాపీల వెల రూ 17 00 లు, రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందటానికి కాపీల వెలతోపాటు రూ 6-00లు చేర్చి M O పంపాలి 'రత్నా ఏజెన్సీస్', 9, దేశికా రోడ్డు, (ఆళ్వారుపేట వద్ద), మద్రాసు - 600 004*

— సర్క్యులేషన్ మేనేజర్

"ఈనాడు మనకు కలుగుతున్న దుఃఖానుభవాలను తలచుకుని భగవంతుని నిందించకూడదు మనం గత జన్మలలో చేసుకున్న

పిలుస్తారు ఈ పొంగలిని అరటి ఆకులలో వడ్డిస్తారు



'Mattu Pongal'

పొంగల్ రెండవ రోజును "మాట్టు పొంగల్" అని పిలుస్తారు ఆ రోజు పండుగ అంతా - రైతుల సహచరులైన - ఆవులు, ఎద్దులు వీటిపై కేంద్రీకృతమౌతుంది ఆవులు పాలు ఇవ్వటంలో, ఎద్దులు పొలం దున్నటంలో, ఎరువులు త్రోలటంలో రైతుకు సహాయపడతాయి ఆ రోజంతా పశువులకు పూర్తి విశ్రాంతి లభిస్తుంది వాటిని ఎంతో గౌరవాదరాలతో చూస్తారు పశువుల కొమ్ములను మెరుగు పెడతారు గలగలమని సంతోష ధ్వనులు చేసే మువ్వలను వాటి మెడల చుట్టూ కడతారు చెఱకు, పండ్లతో పాటు తీయని పొంగలిని కూడా వాటికి పెట్టి భుజింపచేస్తారు

పొంగల్ - మూడవ రోజు - ఆఖరి రోజును "కనుమ పొంగల్" లేక "దర్శన్ పొంగల్" అని పిలుస్తారు ఆ రోజు పిన్నలు పెద్దలకు నివాళులర్పిస్తారు పెద్దలు కూడా వీరిని ఆశీర్వదించి కానుకలు అందిస్తారు ఒకరినొకరు సందర్శించేందుకు, విభేదాలు తొలగించు కునేందుకు - ఆ రోజు ఉపయోగపడుతుంది బంధుమిత్రులు ఒకరి నొకరు సందర్శించుకుని తమ సంబంధ బాంధవ్యాలను పునరుద్ధరించు కుంటారు ప్రత్యర్థులు తమ మధ్య గల వైరం మరచిపోవటం కానీ, మన్నించటం కానీ జరుగుతుంది ఆ రోజు వారికి శాంతి సంతోషాలు, సహోదరత్వంతో కూడిన ఒక కొత్త జీవితం తిరిగి ఏర్పడుతుంది

—"ది టీనేజర్" సౌజన్యంతో

## సుభాషితాలు

తాత్పర్యరచన యామిజాల పద్మనాబస్వామి

*నడువకుమీ తెరువొక్కట*
*కుడువకుమీ శత్రునింట కూరిమితోడన్*
*ముడువకుమీ పరధనముల*
*నుడువకుమీ ఒరుల మనసు నొవ్వగ,*
*సుమతీ।*

*[ఒంటరిగా దారిలో నడవకూడదు (రాత్రి చీకటిలో బొత్తిగా పనికిరాదు) తనకు పగవాడైన వాని ఇంట ఏ సమయంలోనూ వాని కల్లబొల్లి మాటలకు లొంగి భోజనం చెయ్యకూడదు (ప్రాణాపాయం కలిగించే వస్తువు కలిపి ఉండవచ్చు కనుక పరుల సొమ్ము ఎన్నడూ ఆశించకూడదు ఎదుటివారి మనసు బాధపడేటట్టు కరకుగా మాటాడ కూడదు ]*

* * *

*నవరస భావాలంకృత*
*కవితాగోష్ఠియును మధుర గానంబును, తా*
*నవివేకి కెంత చెప్పిన*
*చెవిటికి సంకూదినట్లు, సిద్ధము సుమతీ।*

*[శ్రుతి, లయ, స్వరం, సాహిత్యం తన పాటలో ఇంపుగా నింపుగా వినిపిస్తాడు గాయకుడు - వీటిని ఏమాత్రం లోకజ్ఞానం లేని వాడికి వినిపించడం చెవిటి వాని దగ్గర శంఖం ఊదినట్లే నిష్ప్రయోజనం అవుతుంది ]*

# భారత రత్న

## డా. కట్టమంచి రామలింగారెడ్డి

ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక గొప్ప సంస్కృత విద్వాంసుడు సి రామలింగారెడ్డి మనుమడైన రామలింగారెడ్డి 1880లో చిత్తూరు జిల్లాలోని కట్టమంచి అనే గ్రామంలో జన్మించారు



Dr Cattamanchi Ramalinga Reddy

పాఠశాలలో, కళాశాలలో అతడు ఒక బుద్ధి సూక్ష్మత గల విద్యార్థిగా ఉన్నారు మద్రాసు క్రిస్టియన్ కళాశాల నుండి ఉన్నత శ్రేణిలో పట్టభద్రుడై, పై చదువులకు ఇంగ్లండ్‌లోని కేంబ్రిడ్జ్‌లో నమోదయ్యారు ఇక్కడ విద్యాభ్యాస సమయం మొత్తంలో మొదటి తరగతిలో మొదటి వాడుగా ఉండేవారు 1906లో హిస్టరీ, ట్రిపోస్‌లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు చక్కని ఉపన్యాసకుడుగా ఇంగ్లండ్‌లోని మేథావుల ప్రశంసలు పొందారు

1907లో డాక్టర్ రెడ్డి యుఎస్ఏ సందర్శించి అక్కడ అమలులో ఉన్న విద్యా విధానాన్ని అధ్యయనం చేశారు ఇండియాకు తిరిగి రాగానే బరోడాలోని ఒక కళాశాల వైస్ - ప్రిన్సిపాల్‌గా తన వృత్తిని ప్రారంబించారు కొన్నేళ్ళ తరువాత మైసూరుకు తరలి వెళ్ళారు అక్కడ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌గా పనిచేశారు 1920లో రాజకీయాలలోకి ప్రవేశించేందుకు తన పదవికి రాజీనామా సమర్పించారు అనుభవశాలి అయిన విద్యావేత్తగా వీరు మైసూరు విద్యా విధానాన్ని సంస్కరించి దాన్ని దృఢమైన పునాది పైన నిలిపారు

వాల్తేరులోని ఆంధ్ర విశ్వ విద్యాలయం ప్రథమ వైస్ చాన్సలర్‌గా అనేక విద్యా సంస్కరణలు ప్రవేశ పెట్టారు అక్కడ 17 సంవత్సరాలు పని చేశారు

## ఆణిముత్యాలు

పైనున్న నక్షత్ర స్వర్గాలు, లోనున్న నిశ్శబ్ద కోమల స్వరాలు (ధ్వనులు) చాలు నాకు, సర్వోన్నతుని అస్తిత్వం విశ్వసించేందుకు

— ఇమ్మాన్యువల్ కాంట్

### ఆదేశం

వివేకవంతులు హేతువు చేత ఆదేశించబడతారు, స్వల్ప అవగాహన శక్తిగలవారు అనుభవంతోనూ, అత్యంత అజ్ఞానులు ఆవశ్యకంతోనూ, జంతువులు (మృగాలు) స్వభావంతోనూ (ప్రకృతి) ఆదేశించబడతారు.

— సిసిరో

### జీవన ఫలం

ఆర్జించుకోవటం కంటే పోగొట్టుకోవటమే ఫలం రాదు

— బోరిస్ పాస్టర్‌నాక్

'మన పూర్వ ప్రముఖులను మాటలతో కీర్తించటం కంటే చేతల ద్వారా [illegible] అనుసరించటం [illegible]గా ఉంటుంది'

రెండుసార్లు విశ్వవిద్యాలయ నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తూ డాక్టర్ రెడ్డి మద్రాసు శాసన మండలి సభ్యుడుగా పని చేశారు కౌన్సిల్ (శాసన మండలి)లో అతని ఉపన్యాసాలు అత్యుత్తమమైనవి, వాగ్వివాద నిపుణుడుగా అతని ప్రతిబ ఇతరులు అతిక్రమించలేనిది సమయస్ఫూర్తితో కూడిన చమత్కారం, ఉజ్జ్వలమైన చతుర వచనం - అతణ్ణి ప్రజల దృష్టిలోకి తెచ్చాయి గొప్ప రాజకీయ చింతనాపరుడుగా, రాజకీయ నాయకులు విషయాలను శాశ్వతమైన కొలబద్ధలతో తూచి, ఉన్నత జీవితాలను గడపాలని వీరు విశ్వసించేవారు

దైవదత్తమైన మేధావి డాక్టర్ రెడ్డి - ఆంగ్ల, తెలుగు సాహిత్యాలకు ఎంతో సేవ చేశారు తెలుగు బాషలో వీరు వ్రాసిన "తొలి పలుకులు" తెలుగు ఆలోచనా దోరణికి ఉత్కృష్టమైన కానుకలు తెలుగులో రాజకీయ ఆర్థిక శాస్త్రంపై వీరి వివరణ పత్రం - ఒక ఉత్తేజపూరిత వ్యాసం వీరి "కవిత్వ తత్త్వ విచారం" - ఒక అతి విశిష్టమైన కళాఖండం వీరు రచించిన "నవయామిని" ఆలోచనలు రేకెత్తించే ఒక గ్రందం వీరి విద్యా విషయిక నివేదికలు నేటికీ ఆసక్తితో చదవబడుతున్నాయి

డాక్టర్ రెడ్డి - రాజకీయ, జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్ని విమర్శనాత్మకంగా పరీక్షించి, ప్రభుత్వానికి అమూల్యమైన సలహాలు అందజేశారు

కార్యనిర్వహణలో సత్వరత, వ్యవస్థాపక శక్తి, పనిలో క్రమ శిక్షణ, సమయపాలన - అతనిలోని కొన్ని ప్రత్యేక లక్షణాలు అవే అతణ్ణి ప్రజాదరణ కల మూర్తిగా మలచాయి

డాక్టర్ రెడ్డి 1951లో కాలధర్మం చెందారు

## స్టాంపుల కథ

### సొర చేపలు




*సొర చేప (The Shark) - ఒక పొడవైన, భయంకరమైన, మాంసభక్షక మత్స్యం ఇది 200 మిలియన్ సంవత్సరాలకు పైగా మనుగడ సాగిస్తున్నది ప్రస్తుతం ప్రపంచంలో 250 నుంచి 300 జాతులు వీటిలో గుర్తించబడ్డాయి సొరచేప యొక్క వాసన గుర్తించే శక్తి అమోఘమైనది, గురి తప్పనిది నీటిలోని రక్తాన్ని కూడా ఇది శోధించగలుగు తుంది ఒక దక్షిణాఫ్రికా రాష్ట్రం సిస్కై (Ciskei) ఈ ఆకర్షక జీవులపైన తపాలా బిళ్ళలు విడుదల చేసింది ఒక ధూసర వర్ణపు సొరచేప 8 సెంట్ల తపాలా బిళ్ళపై ముద్రితమైంది దక్షిణాఫ్రికాలోని తూర్పు తీరం ఆవల నున్న వెచ్చని నీటిలో ఇవి సమృద్ధిగా దొరుకుతాయి ధూసర వర్ణపు సొరచేప ఎముకలున్న చేపలనే ప్రధాన ఆహారంగా తీసు కుంటుంది చుక్కలు గల, పగిలిన దంతాలు గల సొరచేప (20 సెంట్ల తపాలాబిళ్ళ) ఎన్నోసార్లు మనిషి పైబడిందన్న ఆరోపణకు గురైంది*

— *కబితా రాయ్*

"ఈ నిరాదారమైన రోజుల్లో - యుగాల నుండి పరిపూర్ణత సాధించిన మేదావంతుల మహత్తర భాషణలు, వీరోచిత కార్యాలతో మన బుద్ధులను

# అభయ ప్రదాత - శ్రీ రాఘవేంద్రస్వామి

డాక్టర్ పి నాగరాజరావు

ఆంధ్రప్రదేశ్‌లోని ఆదోని సమీపంలోగల మంత్రాలయంలో 1671 ఏడిలో సజీవ సమాధి పొందిన శ్రీరాఘవేంద్రస్వామి గొప్ప ధర్మప్రబోధకుడు


RAGHAVENDRA SWAMI

కాంచీపురం (తమిళనాడు) సమీపంలోని భువనగిరి గ్రామంలో పేద, పుణ్య దంపతులైన తిమ్మన్న భట్ట, గోపికాంబలకు 1598లో రాఘవేంద్రులు జన్మించారు అతని పితృ దేవుడు వేదవిద్వాంసుడు వీణావాదనంలో నైపుణ్యం కలవాడు అతని మాతృమూర్తి విద్యుక్త ధర్మ నిర్వహణ చేసే సతీమతల్లి అతని తాతగారు కృష్ణభట్టు - విజయనగరాధీశుడైన శ్రీకృష్ణదేవరాయని ఆస్థానకవి వెంకన్న అని అభిమానంతో పిలువబడే ఈ బాలుడు - వెంకటనాధుడు అతని బావగారైన - మదురైకి చెందిన లక్ష్మీనారాయణాచార్యులచే పెంచబడ్డారు భక్తి భావపూరిత వాతావరణంలో పెరిగి పెద్ద వాడయ్యాడు వేదాల వ్రాతప్రతుల పట్ల మనఃపూర్వకమైన అపేక్ష ప్రదర్శించారు గాత్ర సంగీతంలోనూ, వాద్య సంగీతంలోనూ నైపుణ్యం పెంపొందించుకున్నారు

అతని పద్దెనిమిదవ ఏట వెంకన్న సరస్వతిని వివాహమాడారు మహావిద్వాంసుడైనప్పటికీ అతడు దారిద్ర్యపు వేదనను, కష్టాన్ని అనుభవించారు

ఒకరోజు వెంకన్న తన కుటుంబ సమేతంగా కుంభకోణం చేరుకున్నారు అక్కడ మజిలీ చేసిన శ్రీ సుధీంద్ర తీర్థుల రక్షణలోకి చేరారు శ్రీ సుధీంద్రులు తమ కొత్త శిష్యుని పట్ల దయను ప్రదర్శించి, అతణ్ణి ప్రోత్సహించి, అతని పాండిత్యాన్ని, ప్రతిభనూ

## ఎలక్ట్రిక్ గ్రీన్ కార్లు

*భవిష్యత్తులో రాబోయే ఎలక్ట్రిక్ ''గ్రీన్'' కార్లు బాటరీలతో పనిచేస్తాయి ఇవి కాలుష్య పదార్థాలను వదలవు. ఫ్రాంక్‌ఫర్ట్ లోని "కార్ ఫెస్టివల్"లో సోడియం సల్ఫర్ బాటరీతో నడిచే, 160 కి.మీ.ల పరిధి గల ఒక ఎలక్ట్రానిక్ కారును ఒక అమెరికన్ కంపెనీ ప్రదర్శించింది*

*అయితే కొత్త ఎలక్ట్రానిక్ కార్లను 1993 లో మార్కెట్‌లో ప్రవేశపెట్టే మొదటి సంస్థ - ఒక స్వీడిష్ కంపెనీ అవుతుంది 25,000 డాలర్ల ఖరీదు కల ఈ కారును మొదట కాలిఫోర్నియా (యు ఎస్ ఎ)లో అమ్మకాలు జరుపుతారు 1998 నాటికి అమ్మకాలు జరిగే కొత్త కార్లలో 2 శాతం పూర్తిగా కాలుష్య నివారణ కలిగి ఉండాలని అక్కడ ఇటీవల ఒక చట్టం చేశారు ఈ ధోరణే త్వరితగతిలో యూరప్‌లో కూడా కనిపిస్తున్నది*

*—'హ్యూమన్ రైట్స్ వరల్డ్‌వైడ్' సౌజన్యంతో*

'పైకి పేదవాని వలే కనిపిస్తూ ఒక పిసినారి భాగ్యవంతుడవుతాడు, పైకి ధనికుని వలే కనిపిస్తూ ఒక దుబారా మనిషి పేదవాడవుతాడు''

ఎంతో మెచ్చుకున్నారు వెంకన్న తన కాలాన్నంతా

శాస్త్రాలలో దిగ్గ్రమ కొల్పే అధికారం సంపాదించిన ఒక ప్రఖ్యాత విద్వాంసునిగా రూపొందారు



Sharada (Saraswati)

గురువుగారి ధార్మిక పర్యటనలలో వెంకన్న ఆయనను తరచుగా అనుసరించేవారు అనేక చోట్ల అతడు విద్వాంసులతో శాస్త్ర చర్చలు కొనసాగించి, ఉన్నత స్థాయికి చెందిన తన మేథాశక్తితో వారిని ఓడించేవారు

ఒకనాడు శ్రీసుధీంద్రులు వెంకటనాధుని తన స్థానంలో నియమింపచేయాలనే కోరికను వెలిబుచ్చారు కానీ దీన్ని అంగీకరించేందుకు తాను అశక్తుణ్ణని వెంకటనాధుడు విన్నవించుకున్నారు తనకు తరుణ వయస్కురాలైన భార్య కుమారుడు ఉన్నారనీ, ప్రపంచాన్ని త్యజించి సన్యాసం స్వీకరించటం తనకు కష్టమైన కార్యమనీ చెప్పారు ఈ ఆలోచనలు వెంటాడగా తన గురువుగారైన శ్రీసుదీంద్రుల కోరిక పూర్తిగా సమ్మతించేందుకు గల అయిష్టతతో ఇంటికి తిరిగివచ్చి నిద్రించారు

అతనికి స్వప్నంలో చదువుల దేవత సరస్వతి ప్రత్యక్షమై అతనితో వాదించి తమ ఆధ్యాత్మిక వారసత్వాన్ని మర్చిపోయి, పశు జీవితాన్ని గడుపుతున్న మానవాళిని రక్షించ మనే శ్రీసుధీంద్రుల కోరికను అంగీకరింప జేసింది వెంకటనాధుడు శ్రీసుధీంద్రుల వద్దకు పరుగుతీశాడు సుదీంద్రులు అతనిని తంజావూరుకు తోడ్కొని వెళ్లి 1621లో ఆశ్రమ స్వీకారం చేయించారు అతనికి 'రాఘవేంద్ర' అని నామకరణం చేశారు రాఘవేంద్ర అంటే "పాపాన్ని పరిహరించి, కోరుకున్న వస్తువును సమకూర్చేవాడు" అని అర్థం ఈ వార్త అతని బార్య సరస్వతికి తెలియకుండా నిలుపుదల చేశారు పతీ వియోగం సహించలేక ఆమె ఒక బావిలో మునిగి ప్రాణాలు విడిచి పెట్టింది రెండేళ్ళ తరువాత సుదీంద్రస్వామి కూడా అస్తమించారు సుదీంద్ర మఠానికి అదిపతిగా శ్రీరామవేంద్ర స్వామి ఆయన స్థానాన్ని అలంకరించారు మఠాదిపతిగా వీరు ద్వైత సిద్ధాంతానికి అత్యంత అదికార పూర్వక వివరణ కర్త (ప్రతినిది) గా రూపొందారు

తంజావూరు రాజు, అతని ప్రజలు దుర్భిక్షం నుండి, శత్రువుల దండయాత్రల నుండి రక్షించబడేందుకు శ్రీరాఘవేంద్రులు ప్రత్యేక తపస్సు మరియు ధ్యానం చేశారు రాజులు, నవాబులు అతనికి అనుచరులుగా మారిపోయారు

## ఆంగ్ల భాషలో 400,000 మాటలు

*ఇంగ్లీషు భాషలోని 400,000లకు పైగా ఉన్న మాటలలో అత్యధిక సంఖ్య - దాదాపు 20,000 మాటలను - పాత్రికేయుడు ఉపయోగిస్తాడు క్రైస్తవ మతాచార్యులు, న్యాయవాదులు, వైద్యులు దాదాపు 10,000 మాటలు ఉపయోగిస్తారు సాధారణ విద్యావంతులైన నేర్పరితనం గల పనివారికి దాదాపు 5,000 మాటలే తెలిసి ఉంటాయి*

"[illegible] పటి శరీరాన్ని నష్ట (వ్యర్థ) పర్చేది మరొకటిలేదు దేవుని [illegible] ప్రేమిస్తే ఎవరైనా, దేనికోసమైనా చింత పడేందుకు ఉంటుంది"

— మహాత్మా గాంధీ

ఒక ఋషిగా, అన్ని కోర్కెలు తీర్చే వ్యక్తిగా - ప్రజలు అతన్ని అంగీకరించారు

1669 ప్రాంతాలలో ఆదోని నవాబు నుండి కానుకగా మంత్రాలయం గ్రామాన్ని శ్రీరాఘవేంద్ర స్వామి స్వీకరించారు తన సమాధిలోకి - బృందావనంలో - ప్రవేశించే వరకు వీరు ఆ గ్రామాన్ని తన శాశ్వత నివాసంగా చేసుకున్నారు ఆయన 40 సంవత్సరాలకు పైగా సంయమ జీవితాన్ని గడిపారు

1671 లో శ్రావణంలోని చీకటి దినాలలోని రెండవ రోజున శ్రీరాఘవేంద్రస్వామి - తన నిర్గమనానికి కాలం సమీపించిందనీ, తుంగభద్రానదీ తీరంలో మంత్రాలయం వద్ద ఒక ప్రస్తుతించదగిన బృందావనం నిర్మించమనీ శిష్యులతో చెప్పారు నిత్యం చేసే పవిత్ర ప్రక్షాళన కార్యక్రమాలు నిర్వహించిన తరువాత శ్రీరాఘవేంద్రులు ఒక చేత వీణ ధరించి, తన సాధు ముఖ మండలంలో చిఱునవ్వులు చిందిస్తూ బృందావనంలోకి ప్రవేశించారు పద్మాసనంలో కూర్చుండి గాఢధ్యాన నిమగ్నులయ్యారు ఉచ్ఛ్వాస నిశ్వాసాలను అదుపు చేయగల అభ్యాసం ద్వారా వీరు సచేతన (లేక) స్మృతి ప్రవాహాన్ని నిలిపి వేశారు అతని శరీరం చుట్టూ ఇటికలు పేర్చబడ్డాయి (1200 సాలగ్రామాలు) సమాధి పవిత్ర మృత్తికతో మూత వేయబడింది

ఈ అద్వితీయ ఋషి పుంగవుడు తాను శిష్యుల మధ్య నివసిస్తున్నప్పటికంటే బృందావనంలో ప్రవేశించిన తరువాతనే భక్తులకు అనేక మేళ్ళు సమకూరుస్తున్నారు బృందావనం చేరుకునే లక్షలాదిమంది అనుగ్రహ పాత్రులే శ్రీస్వామి శక్తి సామర్థ్యాలకు కరుణామయమైన యశస్సుకు - విపుల ప్రమాణాలుగా నిలుస్తారు మానవాళిని దీవించేందుకు తాను బృందావనంలో 400 సంవత్సరాలకు పైగా నక్షత్ర శరీరంతో కొనసాగగలనని ఆ ఋషిపుంగవుడు ప్రకటించారు తుంగభద్రానదికి ఆవలి తీరాన నివసించే అతని అనుంగు శిష్యుడు అప్పనాచార్య - నడుస్తూనే ప్రసిద్ధ రాఘవేంద్ర స్తోత్రం కూర్చడం జరిగింది అతడు నిరుత్సాహంతో, నిస్పృహతో ఖిన్నుడై, దాదాపు స్మృతి విహీనుడై బృందావనం చెంత నిలబడ్డాడు ఆ స్తోత్రంలో చివరి పంక్తి - ఏడు అక్షరాలు లభించక - అసంపూర్తిగా మిగిలిపోయింది అప్పుడు బృందావనంలోని ఋషి ఆ ఏడు అక్షరాలు ఉచ్చరించి పంక్తిని పూర్తి చేశారు!

మంత్రాలయం సందర్శించి బృందావనం చెంత నివసించినపుడు తమ సందేహాలు పటాపంచలై, తమ విభేదాలు పరిష్కారమై, తమ మనస్సులు కాంతి పూరితాలై, త్రోవలు వెలుగు తోరణాలై, చీకట్లు వెడలిపోతాయని భక్తుల అనుభవం సంపూర్ణమైన ఆశా విశ్వాసాలతో, సుఖసంతోషాలతో వారు తిరిగి వసారు

## తుక్కుకార్ల విధ్వంసక సంస్థ

*తుక్కు కార్లను పగులగొట్టి, వాటిని వీలైనంతవరకు పర్యావరణ రక్షణకు దోహదం చేసే వస్తువులుగా మార్చే ఒక కర్మాగారాన్ని వాయవ్య జర్మనీలోని లీర్ వద్ద - వోక్స్ వాగన్ నెలకొల్పింది ఈ ప్లాంట్‌లో మొట్ట మొదట నూనెలను, ఇంధనాన్ని వడగట్టి పునరావృత్తికి ప్రత్యేకిస్తారు అప్పుడు, ఇంజన్లు టైర్లు, బ్యాటరీలను మళ్ళీ ఉపయోగించేటట్లు తయారుచేస్తారు పాత ప్లాస్టిక్ బంపర్లను రెసిన్‌తో కొత్త బంపర్స్‌గా రూపొందిస్తారు వోక్స్ వాగన్ యొక్క తాజా "పోలో" కారు బంపర్స్‌లో 20 శాతం ఇటువంటి పునరావృతి వస్తువుల నుండి వచ్చినవే*

— 'సిఇఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

[illegible] రక్షణ కోరే

— ఆలివర్ గోల్డ్‌స్మిత్

# నవభారత నిర్మాతలు

## వి.ఓ. చిదంబరం పిళ్ళై

తమిళనాడులోని సముద్ర తీర పట్టణం ట్యుటికోరిన్‌కు చెందిన ఒక ప్రముఖుడు, ప్రజాదరణ గల వ్యక్తి అయిన వి ఓ చిదంబరం పిళ్ళై స్వాతంత్ర్య పోరాట సమయంలో "స్వప్రయోజనం కంటే సేవే ప్రదానం" అనే ఆశయంతో దేశానికి సేవ చేశారు



V.O. Chidambaram

తమిళనాడులోని చిదంబరనార్ జిల్లాలో ఒట్టపిడరం అనే గ్రామంలో 1872 సెప్టెంబర్ 5న న్యాయవాది ఉలగనాధన్ పిళ్ళై, పరమాయి అమ్మయార్ దంపతులకు వీరు జన్మించారు వీరు తొలి విద్య ట్యుటికోరిన్‌లో అబ్యసించారు పారశాల విడిచిన తరువాత న్యాయశాస్త్రం అభ్యసించి 1895లో బి ఎల్, డిగ్రీ సంపాదించుకున్నారు న్యాయవాదిగా ట్యుటికోరిన్‌లోనే తన వృత్తిని ప్రారంభించారు న్యాయవాదిగా, తన కక్షిదారుల పట్ల అత్యంత దయ కలిగి ఉండేవారు

సమధికోత్సాహం, సమర్థత, చిత్తశుద్ధి కలిగిన ఒక గొప్ప తమిళనాడు నాయకుడుగా, స్వాతంత్ర్య కాంక్షకు ఒక అమూల్యమైన సమర్థకుడుగా తనను తాను ఋజువు చేసుకున్నారు సుబ్రహ్మణ్య శివ, నీలకంఠ బ్రహ్మచారి మరియు వి వి ఎస్ అయ్యర్‌లతో కలసి తమిళనాడులోని విప్లవోద్యమంలో వీరు ముందంజ వేశారు

ఆరోజుల్లో, ఇండియాలోని నౌకా వాణిజ్యం బ్రిటిష్ వ్యాపార సంస్థల గుత్తాదిపత్యంలో ఉండేది తమిళనాడులోని చిన్న తీర పట్టణం - ట్యుటికోరిన్ - ఆ రోజుల్లో ప్రయాణీకుల, సరకుల రవాణాలతో అబివృద్ధి చెందిన ఒక రేవుగా ఉండేది బ్రిటిష్ కంపెనీలు వసూలు చేస్తున్న సరకుల రవాణా రేట్లు చాలా హెచ్చుగా ఉండేవి రవాణా రేట్లు అదికంగా ఉండడం బారత వర్తకులను బాదిస్తుండేది ఆ సమయంలో దక్షిణ బారతదేశానికి చెందిన ప్రముఖులైన స్థానిక వర్తకుల సహాయంతో చిదంబరం పిళ్ళై స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ స్థాపించటం జరిగింది ఆర్థిక రంగంలో బ్రిటిష్‌వారితో పోటీ పడేందుకు అతడు దృఢంగా నిర్ణయించుకోవటం జరిగింది

## ఇండియాలో ప్రథములు

మిస్ సి బి ముత్తమ్మ ప్రథమ మహిళా రాయబారి

శ్రీమతి షన్నోదేవి ఒకరాష్ట్ర శాసన సభకు స్పీకర్‌గా పనిచేసిన మొదటి స్త్రీ

శ్రీమతి కొమిలియా సొరాబ్జీ మొదటి మహిళా బారిస్టర్

శ్రీమతి చంద్రముఖి బోస్ మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ పొందిన మొదటి మహిళ

"మాతృహృదయమే బిడ్డకు పారశాల గది" — హెన్రీ వార్డ్ బీచర్

10 లక్షల రూపాయల అతి కొద్ది పెట్టుబడితో స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ వ్యాపారం ప్రారంభించింది మొదటి నుంచీ



ఈ కంపెనీ ప్రజల సానుభూతినీ, వాణిజ్య వర్గాల మద్దతునూ సంపాదించుకున్నది తన అదీనంలోని అన్ని శక్తులను ఉపయోగించుకుని అబివృద్ధి చెందేందుకు పూనుకున్న ఈ బారతీయ సంస్థను నామరూపాలు లేకుండా చేయాలని గుత్తాధిపత్యపు బ్రిటిష్ స్టీమ్ నావిగేషన్ కంపెనీలు దృఢనిర్ణయం తీసుకున్నాయి అత్యంత అబివృద్ధి చెందినవీ, ఆర్థికంగా పటిష్టంగా ఉన్నవీ అయిన బ్రిటిష్ కంపెనీలు అనేక స్టీమ్ షిప్పులు (ఆవిరి ఓడలు) కలిగి ఉంటే చిదంబరం పిళ్ళై యొక్క స్వదేశీ కంపెనీకి రెండు స్టీమ్ షిప్పులు మాత్రమే ఉన్నాయి అయినప్పటికీ, ఈ కొత్త కంపెనీ అజేయమైన ధైర్యసాహసాలతో, బ్రహ్మాండమైన బ్రిటిష్ కంపెనీలతో పోరాడింది

తమ ప్రత్యర్థిని తుడిచిపెట్టేందుకు బ్రిటిష్ కంపెనీలు అవాంఛనీయ విధానాలను ఉపయోగించాయి అనేక సందర్భాలలో చిదంబరం పిళ్ళై నౌకా వాణిజ్య రంగంలో బ్రిటిష్ వారిని అధిగమించారు కానీ బ్రిటిష్ నౌకారంగం పట్లనే ఎక్కువ పక్షపాతం చూపే అధికారుల ఆగ్రహాన్ని వీరు ఎదుర్కొన వలసి వచ్చింది బ్రిటిష్ అదికారులు పెట్టే బాధలు, క్షోభల నెదుర్కొంటూ పిళ్ళై ఒక వీరుని వలె తుది వరకూ పోరాడారు వీరి వ్యాపార సంస్థ ఆత్మ దిగజార్చబడినా బారత నౌకారంగం అబివృద్ధిపదంలో - రాబోయే సంవత్సరాలలో - మరింత పటిష్టం అయ్యేందుకు అది జీవిస్తూనే ఉంది

## నమ్మలేని నిజాలు

### కాపీ కొట్టేందుకు పావురాళ్ళ ప్రయోగం

*1979లో లక్నో రామదిన్ సింగ్ కాలేజీ హాలులో జరిగిన పరీక్షల్లో కాపీలు అందించేందుకు పావురాలు ఉపయోగించబడ్డాయి పరీక్ష ప్రారంభమైన అరగంటలోనే రెండు పావురాలు హాలులోకి ప్రవేశించేందుకు ప్రయత్నించాయి ఇన్విజిలేటర్ వీటిని దారిలో పట్టుకుని హాల్ సూపరింటెండెంట్‌కు అప్పగించాడు ప్రశ్నలకు సమాధానాలు వీటి కాళ్ళకు కట్టి ఉండటం హాల్ సూపరింటెండెంట్ కనుగొన్నాడు!*

### లక్షద్వీప్ ఇండియాలో భాగమే

*1977 లో లక్షద్వీప్ ప్రధాన పట్టణం కవరట్టికి పంపిన ఒక ఇన్‌లాండ్ లెటర్ మరునాడే తిరిగి వచ్చింది విదేశాలకు పంపే జాబులకు అంటించవలసిన అదనపు తపాలా బిళ్ళలు లేవనే కారణం చూపారు ఏదో ఒక సార్టింగ్ ఆఫీస్‌లోని గుమాస్తాకు లక్షద్వీప్ విదేశం కాదనీ, ఇండియాలో అంతర్భాగమనీ తెలియనందు వల్లనే ఇలా జరిగింది*

### చేపల వేటలో విల్లంబులు

*పాపువా న్యూగినియా (ఆగ్నేయ ఆసియా) తీర ప్రాంతవాసులు ఇప్పటికి కూడా తమ చేపల వేటకు ధనుర్బాణాలు ఉపయోగిస్తారు అమ్ముకు ఒకే ఒక కమ్మీ ఉంటుంది అది విల్లుకు త్రాటితో (నారి) బంధించబడి ఉంటుంది దీనివల్ల ఇది మళ్ళీ స్వాధీనం చేసుకునేందుకు వీలవుతుంది*

"మనిషి పక్షి మాదిరిగా ఎగరటం నేర్చుకున్నాడు, చేపవలె ఈదటం నేర్చుకున్నాడు, కానీ నేలపైన గౌరవంగా (దర్జాగా) నడవటం నేర్చుకోలేదు

చిదంబరం పిళ్ళై - ఒక శక్తివంతుడైన వక్త వీరి అత్యంత ఉత్తేజపూరిత ఉపన్యాసాలు జనసామాన్యంలో జాతీయతా ఉత్సుకతను రేకెత్తించేవిగా ఉండేవి తన జిల్లాలోని మిల్లు కార్మికులకు సహాయపడేందుకు వీరు నిర్వహించిన కార్యకలాపాలు - అధికారులు వీరిపట్ల విరోధంతో ఉండేటట్లు చేశాయి వీరికి వ్యతిరేకంగా వ్యక్తిగత జామీనుకు సంబంధించిన కార్యకలాపాలను ప్రభుత్వం ప్రారంభించింది ఇది భగ్నం కాగానే వారు చిదంబరాన్ని ఒక రాజద్రోహం నేరం ఆరోపణలో ఇరికించారు వీరిని విచారణ చేసి నేరస్థునిగా నిర్ణయించి, రాజద్రోహం ఆరోపించి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించారు

చిదంబరం పిళ్ళై తన కారాగారవాస శిక్షను ఓర్మితో, సాహసంతో అనుభవించారు వగ తీర్చుకునే తీర్పుగా దీన్ని భావించిన ఆనాటి ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్-జాన్ మోర్లే - కలుగజేసుకున్నందువల్ల హైకోర్టు చిదంబరం పిళ్ళై కేసును పునస్సమీక్షించి అతని శిక్షా కాలాన్ని - ఆరేళ్ళ కఠిన కారాగార వాస శిక్షకు తగ్గించింది 1911లో చక్రవర్తి పట్టాభిషేక సందర్భంలో - వీరి సత్ప్రవర్తన, సుస్వభావం కారణంగా కొద్ది కాలం మాత్రం జైలు శిక్ష అనుభవించి విడుదల అయ్యారు

విడుదల తరువాత చిదంబరం పిళ్ళై మద్రాసులో స్థిర నివాసం ఏర్పరచుకుని తన ప్రజాహిత కార్యకలాపాలు కొనసాగించారు అతడు కార్మిక ఉద్యమంలోకి ప్రవేశించి - పెరంబూర్ రైల్వే కార్మిక సంఘం అధ్యక్షుడుగా దానికి సన్నిహితులయ్యారు సాంఘిక సంక్షేమం మరియు జాతీయ కార్యకలాపాలలో పాల్గొనటంతో పాటు కొంతకాలం న్యాయవాద వృత్తిని కూడా చేపట్టారు

తీవ్రమైన ఆసక్తి ప్రదర్శించారు తమిళ మహాగ్రంథం "తిరుక్కురళ్"కు ఉన్నత శ్రేణికి చెందిన వ్యాఖ్యానం కూడా రచించారు

1936 నవంబర్ 18న ఆయన కాలధర్మం చెందారు

## అన్ని పూజల సారం




*అన్ని పూజల సారాంశం ఇది నిర్మలంగా ఉండటం, ఇతరులకు మంచి చెయ్యటం పేదలలో, బలహీనులలో, రోగగ్రస్తులలో పరమేశ్వరుని చూసినవాడు నిజంగా శివుని ఆరాధిస్తున్నవాడే కేవలం (విగ్రహం) ప్రతిబింబంలోనే శివుణ్ణి చూస్తే అతని ప్రారంభదశలో ఉన్నట్లే*

*— స్వామి వివేకానంద*

## పెద్ద మిడుతల గుంపు

*ఒకపెద్ద మిడుతల గుంపు - 40-80 మిలియన్ పురుగులు కలది ఒక రోజులో 80,000 టన్నుల ధాన్యాన్ని తినివేస్తుంది. ఈ ధాన్యం ఒక సంవత్సరం పాటు 400,000 మందికి ఆహారం సమకూర్చగలుగుతుంది*

'ఓ నాలుకా! తినేటప్పుడు, మాట్లాడేటప్పుడు నిగ్రహంతో ఉండు
ఎందుకంటే అపరిమితంగా తినటం, అధికంగా మాట్లాడటం [illegible]

# విగ్రహారాధన

మహాత్మా గాంధీ

విగ్రహారాధన చెడ్డది విగ్రహపూజ ఆ విధంగా లేదు

ఒక విగ్రహారాధకుడు తన విగ్రహాన్ని ఒక మహిమగల వస్తువుగా తయారు చేస్తాడు



Gandhiji

ఒక ప్రతిమను పూజించేవాడు ప్రతిరాతిలో దేవుణ్ణి చూస్తాడు అందువల్ల భగవంతునితో తను సంయోగం ఏర్పర్చుకునేందుకు, ఒక విగ్రహ సహాయం తీసుకుంటాడు

బెనారస్‌లోని ప్రసిద్ధ దేవాలయంలో ఉన్న రాయి కాశీ విశ్వనాథుడు కాడని ప్రతి హిందూ బిడ్డకు తెలుసు

ఈ సృష్టికి ప్రభువు - ప్రత్యేకించి - ఆ రాతిలోనే ఉన్నాడని అతడు నమ్ముతాడు ఈ ఊహానాటకం అనుమతించదగినది మరియు ఆరోగ్యకరమైనది

పుస్తక విక్రయశాలలోని ప్రతి గీతా ప్రచురణం కూడా నా సొంత ప్రతికి నేను మోపే పవిత్రతతో ఉండదు

ఏ ఇతర వాటిలో కంటే నాసొంత ప్రతిలోనే ఎక్కువ పవిత్రత ఉండదని తర్కం నాకు చెబుతుంది పవిత్రత - నా ఊహలోనే ఉంది

ఆ ఊహ ఒక అద్భుతమైన యధార్థమైన ఫలితాలను తెస్తుంది అది మానవుల జీవితాలను మారుస్తుంది

మనం ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా మనమంతా ప్రతిమలను పూజించే వారమూ, విగ్రహారాధకులమూ అని నా అభిప్రాయం

ఒక గ్రంథం, ఒక భవనం, ఒక చిత్రం, ఒక చెక్కిన శిల్పం - ఇవన్నీ నిస్సందేహంగా దేవుడు నివసించే ప్రతి బింబాలే కాని ఇవి 'దేవుడు' కాదు

అవి దేవుళ్ళనని ఎవరైనా చెబితే, పొరబడినట్లే

— హరిజన్

## బెలూన్ మ్యూజియం

*పశ్చిమ జర్మనీలో ఆగ్స్‌బర్గ్ వద్దగల ఒక చిన్నపట్టణం గెర్‌స్తోఫిన్‌లో ప్రస్తుతం ఒక బెలూన్ (గాలి గుమ్మటం) మ్యూజియం నెలకొల్పారు 200 సంవత్సరాల బెలూన్ చరిత్ర నుండి సమకూర్చుకున్న అసలు మాదిరులు, ప్రతి రూపాలు, ఫోటోలు, పుస్తకాలు, తపాలా బిళ్ళలు మరియు ఆసక్తి కలిగించే వస్తువులు ఇక్కడ ప్రదర్శిస్తున్నారు*

— 'స్కాలా' సౌజన్యంతో

"ఉచ్చులో చిక్కుకుని తన్నుకులాడే కంటే, ప్రలోభం నుంచి తప్పుకోవటం మంచిది"

— జాన్ డ్రైడెన్



# రాతితో నిర్మించిన నాగస్వరం

ఏ ఆర్ షెరీఫ్

తమిళనాడు లోని తంజావూరు జిల్లాలో ఉన్న కుంభకోణంలోని కుంభేశ్వర స్వామి ఆలయంలో ఉన్న రాతితో చెక్కిన నాగస్వరం గాలితో ప్రత్యేకించి - ఊపిరి (లేక) శ్వాసతో ధ్వనించే ఒక సంగీత వాద్యం) - ఒక అసాధారణ శిల్పియొక్క అద్వితీయ సృష్టి. ఒక విచిత్రమూ,




మార్మికమూ అయిన ఊహతో జ్వలించిన - శిలలు చెక్కే ఒక అజ్ఞాత వ్యక్తి - ఒక రాతిలోని కఠినమైన ముక్కను ఉలితో చెక్కి - ఒక చివరి నుంచి మరొక చివరి వరకు రంధ్రంతో కూడిన సన్నాయి గొట్టంగా తయారు చేశాడు తరువాత దానిపైన రంధ్రాలు వేసి ఈ రాతి గొట్టాన్ని - దక్షిణాదిలోని సుప్రసిద్ధ (వాయు) వాద్యం - నాగస్వరంగా - మార్చాడు

లోహాలతో తయారుచేసిన ఇతర సాధారణ నాగస్వరాల మాదిరిగానే ఈ రాతి నాగస్వరంతో కూడా ఇంపైన, శ్రావ్యమైన రాగాలు పాడవచ్చు

ఒక చివర ఒక అంగుళం వ్యాసం గల రంధ్రంతో రెండు అడుగుల పొడవైన గొట్టం ఇది ఈ రంధ్రం మూడు అంగుళాల వ్యాసం మేరకు రెండో చివరి వైపుకు విస్తృతం అవుతుంది

ఈ రాతి నాగస్వరానికి - గొట్టానికి - ఒక పలుచని, ఒకే విధమైన రాతిగోడ ఉంటుంది దాని పైభాగంలో - క్రమమైన విరామంలో వాయించేందుకు వీలుగా - ఏడు చేతి వేళ్ళు రంధ్రాల వరుసలు చేయబడ్డాయి బహుశా శృతి స్థాయిని అదుపు చేసేందుకు - ప్రక్కల నాలుగు ఇతర రంధ్రాలు ఉన్నాయి రంధ్రాలు గొట్టం రాతిలో సొగసుగా చెక్కబడి - ఈ యావత్ ఖండం (తునక) మృదువైన తుది మెరుగులతో నగిషీగా రూపొందించబడింది నోటిలో ఉండే భాగం ద్వారా నాగస్వరంలోకి గాలిని ఊది, చేతివ్రేళ్ళతో రంధ్రాలను నేర్పుగా - వాయు విభాగాన్ని - నడపటం ద్వారా ఏ సంగీతాంశాన్నైనా వాయించవచ్చు

# కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో మొదటి దేశం

*1951 లోనే కుటుంబ నియంత్రణ కార్యక్రమం చేపట్టిన ఇండియా ప్రపంచంలోనే - ఈ దిశలో మొదటి దేశం దేశంలో 130 మిలియన్ పుట్టుకలను నివారించినట్లు అంచనా వేయబడింది*

## ప్రపంచ ప్రాచీన వాణిజ్య విమాన సంస్థ

ప్రపంచంలో ప్రాచీనమైన వాణిజ్య విమాన సంస్థ నెదర్లాండ్స్‌కు చెందిన కెఎల్ఎం (KLM) 1920 మే 17న తన మొదటి నిర్ణీతకాల విమానయానం - ఆమ్‌స్టర్‌డామ్ - లండన్‌ల మధ్య ప్రారంభించింది ఈ విమాన సంస్థ 1919లో స్థాపించబడింది

## మొదటి అధికారిక ఒలింపిక్ మెడల్

1952 హెల్సింకీ (ఫిన్లాండ్) ఒలింపిక్స్‌లో కె డి యాదవ్ కుస్తీలో కంచు పతకం పొందాడు అథ్లెటిక్స్‌లో ఇండియా సాదించిన మొదటి అధికార పూర్వకమైన ఒలింపిక్ మెడల్ ఇదే

## సౌదీ అరేబియాకు నామకరణం

హిజాజ్‌కు ఇబన్ సౌద్ రాజుకాగానే ఆ దేశం పేరును సౌదీ అరేబియాగా 1 926 జనవరి 8న మార్చివేశాడు

## సుదీర్ఘమైన విమాన ప్రయాణం

1976 డిసెంబర్ 13న సిడ్నీ (ఆస్ట్రేలియా) నుంచి శాన్‌ఫ్రాన్సిస్కో (పశ్చిమ అమెరికా)కు ఒక పాన్ అమెరికన్ బోయింగ్ 747 పాసింజర్ విమానం సుదీర్ఘమైన - ఎక్కడా ఆగకుండా - 13 గంటల 14 నిమిషాలపాటు ప్రయాణం చేసింది

## మొదటి పోలీస్ శునకదళం

నేర పరిశోధన కోసం 1951లో మద్రాసులో మొదటి పోలీస్ శునకదళం ఏర్పాటు చేశారు

## ప్రపంచంలో అత్యధిక ఆటవస్తువుల తయారీదారు

యునైటెడ్ స్టేట్స్ కాలిఫోర్నియాలోని హాథోర్న్‌లోని మేట్టెల్ ఇన్‌కార్పొరేషన్ ప్రపంచంలో అత్యదిక ఆటవస్తువుల తయారీ దారు దీన్ని 1945లో స్థాపించారు

## హెచ్చు విలువ గల తపాలాబిళ్ళ

హెచ్చు విలువగల తపాలా బిళ్ళను 1925లో కెన్యా (తూర్పు ఆఫ్రికా) విడుదల చేసింది ఈ 100 పౌండ్ల తపాలా బిళ్ళను వేట లైసెన్స్‌లకు ముఖ్యంగా వాడతారు

## ప్రపంచంలో స్ఫోటక నిర్మూలన

ప్రపంచంలో పూర్తిగా స్ఫోటక వ్యాది (small pox) నిర్మూలనం చెందిందని ప్రపంచ ఆరోగ్య సంస్థ 1980 మే 8న ప్రకటించింది

## ప్రయాణీకుని చెట్టు!

*ప్రయాణీకుని చెట్టు (Traveller s Tree) మెడగాస్కర్‌లో కనుగొనబడింది. దీని తోపులు మరుపియస్ మరియు జావా దీవుల్లో పెంచబడుతున్నాయి ఇది ఒక తాడి చెట్టు వంటిది దీని కాడలు లేక చిన్న కొమ్మలు రెండు విభిన్న ప్రక్కలుగా పెరిగి బ్రహ్మాండమైన ఆకులు కలిగి ఉంటాయి ఇది ఒక బ్రహ్మాండమైన వినసకర్రవలే ఉంటుంది ఉత్తరం, దక్షిణం చూపే ఈ ఆకులు ద్రవాలను వాటి మూలాధార ప్రదేశాల్లో నిల్వ చేస్తాయి వీటిని కోసినప్పుడు అత్యధికంగా నీటివంటి ద్రవం వెలికి వచ్చి ప్రయాణీకుని దప్పిక తీరుస్తుంది చవిటి నేలలు లేదా చక్కని నీటి సౌకర్యంకల నేలల్లో తప్ప వేరొకచోట ఈచెట్టు వృద్ధి పొందలేదు*

'మనిషి యొక్క గౌరవం అంతా ఆలోచనలోనే ఉంది కనుక సక్రమంగా ఆలోచన చేసేందుకు శ్రమించు '' — పాస్కల్

# రోదసిలో వ్యోమగాములు ఎంతకాలం ఉండగలుగుతారు?

**ఆంద్రీ ఇవఖ్నోవ్**

వ్యోమయానంలోని వింతైన విషయాల్లో ఒకటి - బరువు కోల్పోయేస్థితి మీరు వ్యోమ శకటంలో - మీ మామూలు బరువుతోనే ఉన్నా మీరు నేలకు చేరలేరు కారణమేమిటంటే నేల కూడా వ్యోమశకటంతో, వ్యోమగాములతో కలిసి ప్రయోగ స్థలానికి దిగిపోవటమే




మొదట్లో - భారరహిత స్థితి వినోదంగా కనిపిస్తుంది స్పేస్‌క్రాఫ్ట్ కాబిన్‌లో - నీటిలోని చేపవలె మీరు ఈదవచ్చు కాని అతిత్వరలో ఇది ఇబ్బందికరంగా మారుతుంది రక్తం మీ తలకు చేరుకుంటుంది మీ చెవులు ఝుంకారం చేస్తాయి మీకు వికారం కలుగుతుంది చాలాకాలంపాటు మీరు తలక్రిందులుగా నిలబడినట్లు అనిపిస్తుంది

వ్యోమయానం చేస్తున్న కొద్దిరోజుల్లోనే మీ శరీరం భారరహిత స్థితికి అలవాటు పడు తుంది అది సులభంగా కనిపిస్తుంది ఏమీ బాధించదు మీ కండరాలు తేలికగా అలసట చెందవు అయితే అదే పొరబాటు క్రమేణా కండరాలు బలహీనమౌతాయి ఎముకలు గట్టిదనం కోల్పోయి బోలుగా తయారవుతాయి గుండె పూర్తిస్థాయిలో పని చేయనందువల్ల సోమరిగా తయారవుతుంది వ్యోమయానం తరువాత భూమిపైకి తిరిగిరాగానే కాళ్ళు, చేతులు సీసం వలే తయారవుతాయి హృదయ స్పందన కష్టమౌతుంది భూమ్యాకర్షణ శక్తికి అనుగుణంగా మళ్ళీ ప్రవర్తించటానికి శరీరానికి కొన్ని వారాలు పడుతుంది

రోదసిలో వ్యోమగాములు కండరాలకు ప్రయాస కలిగిస్తూ తరచుగా వ్యాయామం చేస్తారు ప్రత్యేక ఔషధం తీసుకుంటారు వారి శరీరాలు భూమియందలి స్థూలరూపంలోనే ఉండేందుకు, వారు తిరిగి రావటం సులభ మయ్యేందుకు ఇవి తోడ్పడతాయి

వ్యోమగాములు ఒక నెలరోజులపాటు రోదసి లోకి వెళ్ళి ఏ సమస్యా లేకుండా తిరిగి వచ్చారు

## ప్రపంచంలో పొడవైన సహజ వంతెన

*యుటా (యు ఎస్ ఎ)లో మోబ్ వద్ద నున్న ఆర్చెస్ అండ్ కాన్యాన్ లాండ్స్ నేషనల్ పార్క్‌లోని ప్రకృతి దృశ్యపు ఆర్చ్ (కమాను) - ప్రపంచంలోని పొడవైన సహజ సిద్ధమైన వంతెన ఇది 291 అడుగులకు విస్తరించి లోతైన కనుమ పీఠం నుంచి 100 అడుగుల ఎత్తున ఉంటుంది యుటాలోని రెయిన్‌బో వంతెన 278 అడుగుల పరిధి, 22 అడుగుల వెడల్పు కలిగి ఉంటుంది సింకియాంగ్ (చైనా) లోని కాషిహ్ వద్ద గల ఇసుకరాతి కమాను దాదాపు 1000 అడుగుల ఎత్తు, 150 అడుగుల కొలత కలిగి ఉంటుంది ఈ ప్రకృతి సిద్ధమైన ఆర్చ్ ప్రపంచంలో ఎత్తైనది*

"మన వ్యాకులాలకు కారణం భయం భయరహితంగా ఉండటమనేది క్షణంలో స్వర్గాన్ని తీసుకు వస్తుంది"

తరువాత రోదసిలో రెండునెలలు, ఇంకా ఎక్కువ కాలం గడిపారు వ్యోమయాత్రకు సరైన కాలవ్యవధి మూడుమాసాలేనని శాస్త్రవేత్తలు నిర్ణయానికి వచ్చారు ఒక నెలరోజులు కొత్త పరిస్థితులకు అలవాటుపడి చుట్టుప్రక్కల విషయాలు అవగాహన చేసుకునేందుకు, రెండు నెలలు పూర్తిగా పనిలో లీనమైపోయేందుకు సరిపోతాయి దీని తరువాత వ్యోమగాములు సులభంగా అలసటకు లోనవుతారు కనుక ఇక వారు గృహాలకు తిరిగి వచ్చే సమయం ఆసన్నమైందని భావించాలి

అలాంటి సమయంలో, మరి వ్యోమగాములు రోదసిలో ఎందుకు ఎక్కువకాలం గడుపు తున్నారు? ఎందుకంటే, ఏదో ఒకరోజున ప్రజలు భూమి చుట్టూ విమానయానం చేయటమే కాకుండా, వారు అంగారకగ్రహం మరియు ఇతర గ్రహాలకు కూడా ప్రయాణం చేసే సమయం వస్తుంది అంగారక గ్రహానికి ప్రయాణం కొనసాగించి, తిరిగి భూమికి చేరేందుకు 30 నెలలకు పైగా పడుతుంది ఇప్పటికిప్పుడే శాస్త్రజ్ఞులు అంగారక గ్రహానికి ఒక పర్యటన ఏర్పాటు చేయవచ్చు కానీ ప్రజలు అంత దీర్ఘ ప్రయాణం చేసేందుకు సమర్థత కలిగి ఉన్నారా అనే విషయం మనకు ఇంకా తెలియదు

మానవుడు రోదసిలో ఒక సంవత్సరం వరకు జీవించగలడని డాక్టర్లు నిశ్చయంగా చెబు తున్నారు

దీర్ఘకాలం ఒక మనిషి పడకకే అంకితమై పోతే - ఒక వ్యోమగామి భారరహిత స్థితిలో ఏవిధమైన మార్పులు అనుభవిస్తాడో, ఇతని శరీరం కూడా అవే మార్పులు పొందుతుంది ప్రయోగానికి లోనైన వ్యక్తులను డాక్టర్లు జాగ్రత్తగా పరిశీలన చేస్తారు ఈ పరిశీలనలు మరింత ఎక్కువకాలం వ్యోమగాములు వ్యోమయానం చేసేందుకు తోడ్పడతాయి

— 'మిషా'

## ప్రపంచంలో బ్రహ్మాండమైన రాతి ఆనకట్ట



*కృష్ణానదిపై నిర్మించిన నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌లోని నల్గొండ జిల్లాలో నందికొండ గ్రామ సమీపంలో 1 5 కి మీ ల దూరంలో నదికి దిగువన నిర్మించబడింది ఇది ప్రపంచంలోని పెద్దరాతి ఆనకట్ట దీని పొడవు 4 80 కిలోమీటర్లు దీనిలో రాతి విభాగం 1450 60 మీటర్లు ఉంటుంది ఈ ఆనకట్ట ఎత్తు 409 అడుగులు, దీని జలాశయం విస్తీర్ణం దాదాపు 284 90 చ కి మీ లు ఈ ప్రాజెక్టు పూర్తి కావటంతో 22 1 లక్షల ఎకరాలు సాగులోకి రావటమే కాక, రాష్ట్రానికి కావలసిన విద్యుత్ సౌకర్యం కూడా కలుగుతున్నది*

## ప్రసిద్ధ అశ్వారోహకుడు

*ప్రసిద్ధ అశ్వారోహకుడు ఎడ్డీ అర్కారో (Eddie Arcaro) తన 25 సంవత్సరాల గుఱ్ఱపు (పరుగు) పందేల వృత్తిలో 223 మిలియన్ డాలర్లు గెలుచుకున్నాడు. అతడు 4,000 పైగా పందాలలో గెలిచాడు 15 000 గుఱ్ఱాలను స్వారీ చేశాడు*

'మనిషి భోళాజంతువు దేనినైనా నమ్ముతాడు నమ్మకాలలో ఉంచి వాటికి ఆధారాలు దొరక్కపోతే, చెడ్డవాటితోనే తృప్తిపడతాడు '

— బెర్‌ట్రాండ్ రస్సెల్

చెద పురుగులు - తెల్ల చీమలని పేరొందినవి - ఉష్ణ మండలాల్లోనూ, వేడిమి వాతావరణంకల దేశాల్లోనూ కనిపిస్తాయి వీటిల్లో 2,000 రకాలు ఉన్నాయి ఇవి మొక్కలయొక్క కొయ్యలను, మ్రాను యొక్క ధాతువులను భక్షిస్తాయి అందు వల్లనే ఇవి భవనాలకూ, ఫర్నిచర్‌కూ, గుడ్డలకూ, పంటలకూ అపార నష్టాన్ని కలిగిస్తాయి




వ్యవసాయం, సివిల్ ఇంజనీరింగ్ ప్రాజెక్టులకు తీవ్రమైన అడ్డంకులుగా ఋజువైన చిన్న మట్టి దిబ్బలను కూడా ఇవి నిర్మిస్తాయి కానీ ఈ దిబ్బలు పొడిగా ఉండటంతో పొయ్యి కొలుములు, ఇటికలు మరియు మట్టి పాత్రలు చేసేందుకు ఉపయోగిస్తారు గోడలకు పూత పూసేందుకు, రోడ్లు, కాలి త్రోవలు మరియు టెన్నిస్ కోర్టులకు ఉపరిభాగం వేసేందుకు ఉపయోగిస్తారు

జంతువుల ప్రోటీన్లకు మూలాధారంగా చెదలు నిలుస్తాయి ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో ఆహారంగా కూడా తీసుకోబడుతున్నాయి

చెదలు నేలలో జీవిస్తాయి వీటి నివాసస్థానం సాధారణంగా నేల అడుగున గదులుగా నిర్మితమై, ఉపరితలంపై వీటిజాడ కనిపించకుండా ఉంటాయి మరికొన్ని స్పష్టంగా కనిపించే దిబ్బలలో - కొద్ది సెంటీ మీటర్ల నుంచి, 9 మీటర్ల ఎత్తుగల వాటిల్లో నివసిస్తాయి చెదలు తమ దవడలతో మోసుకుపోయే ఇసుక రేణువు లతో ఈ దిబ్బలు తయారవుతాయి వీటిని బంక మన్ను మరియు ఉమ్మినీటి మిశ్రమంతో దృఢ పరుస్తాయి ఈ చెదల దిబ్బ (పుట్ట) తరచుగా క్రొత్తదిగా తయారు కావటమో, విస్తృతం కావటమో, లేదా పరిసరాలకు అనుగుణంగా మరో చోటికి మారటమో జరుగుతుంది

సూక్ష్మమైన శీతోష్ణస్థితికి అనుగుణంగా గాలి ధారాళంగా ప్రసరించేటట్లు - చెదల (పుట్టలలో) దిబ్బలలో అనేక గదులు, విభాగాలు నిర్మితమై ఉంటాయి

ఖనిజ సంపదను వెలికి తీసేందుకు విస్తారమైన చెదల పుట్టలు చిట్కాలందించి తోడ్పడతాయి

## పొగత్రాగే గర్భిణులు

*గర్భవతులుగా ఉన్న స్త్రీలు పొగత్రాగితే గర్భంలోని పిండం అభివృద్ధి త్వరితంగా జరగదు పిండం లేదా పుట్టిన శిశువు మరణించగల అవకాశాలు కూడా ఎక్కువే తల్లి పొగత్రాగటం వల్ల పుట్టిన తరువాత పిల్లలలో శారీరక పెరుగుదలలో లోటు, మేధా సంబంధమైన, ఉద్వేగ సంబంధమైన అభివృద్ధిలో కూడా లోటు ఏర్పడుతుంది ఊపిరితిత్తులు మరియు స్వరపేటిక కాన్సర్ వచ్చేందుకు ప్రధాన కారణం పొగ త్రాగటమని నేడు గమనించటం జరిగింది అది నోటి కాన్సర్ మరియు అన్నవాహికలో కాన్సర్‌ను తప్పక కలిగిస్తుందని రూఢి అయింది మూత్రాశయం, మూత్రపిండం, వృక్వకము (Pancreas), అన్నకోశం మరియు కంఠంలో వచ్చే కాన్సర్‌కు కారణం*

*—యుఎస్.సర్జన్ జనరల్ నివేదిక*

"వినటం ఎలాగో తెలుసుకో, అప్పుడు చెడుగా మాట్లాడిన వారి నుంచి కూడా నీవు లాభం పొందగలుగుతావు"

# మీ పర్యటన సార్థకం చేసుకోండి

ఎస్పీ

మీరు పర్యటించే సమయంలో జనాన్ని కలుసుకోవటం ఒక లాభదాయకమైన అనుభవాన్ని కలిగిస్తుంది అతడు మీతో కలిసి కాఫీ సేవించిన పెట్రోల్ పంప్‌లోని సహాయకుడు కావచ్చు లేదా తన ఉడుత గూడును మీకు చూపించిన ఒక గ్రామీణ యువకుడు కావచ్చు



ఒక చిన్న సంభాషణ వల్ల మీరు ఎన్నో విషయాలు తెలుసుకుంటారు

మీరు ఎక్కడికి వెళ్ళినా - అక్కడి ప్రకృతి దృశ్యం, హొటళ్ళు ఈత - మీ పర్యటనలో వాస్తవంగా ఉపయోగించేవి ఇవి కావు, దారి పొడవునా మీరు చేసుకునే స్నేహితాలే మీకు తోడ్పడతాయి

తమ పర్యటన విశేషాలను చెప్పే మిత్రుల మాటలు వినండి ప్రతి సంతోషపూర్వక స్మృతులలో ప్రజలే ఆకృతి దాల్చి కనిపిస్తారు

పటాలు, నిఘంటువులు, ట్రావెలర్స్ చెక్కులు ఉన్న చిన్న పుస్తకాలు చేత పట్టుకుని వచ్చే పర్యాటకులు ఎప్పుడో ఒకప్పుడు చింతతో కూడిన, వ్యయభరితమైన జీవితాలను విదేశాలలో గడిపినవారే

జ్ఞాపక చిహ్నాలను, వస్తుప్రదర్శన శాలలను చూసేందుకు పర్యాటకులు బస్సుల నిండా క్రిక్కిరిసి ప్రయాణం చేయటం తరచుగా మీరు చూస్తుంటారు కానీ వారు త్వరితంగా వెళ్తున్నప్పుడు - అన్నిటిలోకి పులకరింపజేసే దృశ్యం - దారి పొడవునా ఉండే నివాస గృహాలను చూడటాన్ని కోల్పోతారు

## ఇండియాలో అత్యంత ప్రజాదరణ పొందిన చర్చి



*గోవాలోని - బసిలికా ఆఫ్ బామ్ జీసెస్ - ఇండియాలోని అత్యంత ప్రజాదరణ పొందిన చర్చిలలో ఒకటి ఈ చర్చి 1605లో నిర్మించబడింది సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ యొక్క రత్నాలు పొదిగిన, ఉత్తమంగా చెక్కిన సమాధి అక్కడ ఉన్నది ప్రతి పది సంవత్సరాలకు ఆ మహా పురుషుని అవశేషాలను ప్రజల దర్శనార్థం బయల్పరుస్తారు*

"నేడు హృదయం తెలుసుకున్న దాన్ని రేపు శిరస్సు అర్థం చేసుకుంటుంది"

— జేమ్స్ సీ

మొజాయిక్ ఫ్లోర్‌లతో ఉండే - చలువరాతి భవనాలను చూడటం రమ్యమైనదే కానీ మీరు సందర్శించిన ప్రదేశంలో పుట్టి నివసిస్తున్న ఒక వ్యక్తి సాహచర్యంలో క్రొవ్వొత్తి కాంతుల గదిలో ఒక గ్లాస్ నారింజ రసమో, ఆపిల్ రసమో స్వీకరించటం మీరు కోల్పోకూడదు

పర్యటనల్లో ప్రజల్ని కలుసుకోవటానికి ప్రత్యేక నైపుణ్యం అవసరం లేదు మీ పర్యటనల్లో ప్రజల్ని కలుసుకునేందుకు సులభమైన మార్గం - మీ స్నేహితులను కలిసి తనిఖీ చేసుకోవటం. మీరు వెళ్తున్న ప్రదేశాల్లో వారికి స్నేహితులు ఉన్నట్లయితే వారి వద్దనుండి ఒక పరిచయ లేఖ తీసుకోవటం

ఒక కొత్త చోటుకు రాగానే కారులో నుంచి బయటికి వచ్చి నడక ప్రారంభించాలి ఆ స్థలాన్ని గురించి అభిప్రాయ పడేందుకు వీలుగా ప్రధానమైన వీధుల్లోనూ, సందు గొందుల్లోనూ తీరికగా విహరించాలి ఒక దుకాణంలో కానీ, టీస్టాల్‌లో కానీ, లేదా హొటల్‌లో కానీ ఎవరితోనైనా, ఏదైనా సంభాషణలోకి దిగాలి బొంబాయిలో ఒక పార్క్ బెంచిపైన నా ప్రక్కనే కూర్చున్న ఒక చెవిటి, మూగ వ్యక్తిని - నేను ఇంతవరకు కలుసుకున్న అత్యంత సహాయకారిగా భావిస్తాను ఒక పటం చేతిలోకి తీసుకుని సౌంజ్ఞల ద్వారా, వ్రేళ్ళతో మేము మాట్లాడుకున్నాము నేను ఎన్నోరోజుల పాటు స్వయంగా తయారు చేసుకోవలసి వచ్చే నగర దర్శనపు మేలైన స్కెచ్‌ని ఒక గంటలో అతడు తయారు చేసి ఇచ్చాడు

## 15 ఏళ్ళకే మిలటరీ పైలెట్

*రాయల్ ఎయిర్‌ఫోర్స్ (బ్రిటన్) లో సార్జెంట్ థామస్ డబ్నే 15 సంవత్సరాల 5 నెలల వయస్సులోనే మిలటరీ పైలెట్‌గా అర్హత పొందాడు*

## ప్రపంచంలో అత్యధిక ధనవంతుడు



*బ్రూనీ (Brunei) సుల్తాన్ - హస్సనల్ బోల్కియాహ్ - ప్రస్తుతం ప్రపంచంలోని అత్యధిక ధనవంతుడు అతని ఆస్తుల విలువ 37 బిలియన్ డాలర్లుగా అంచనా వేయబడ్డాయి మలేషియాకు ఆవల ఉన్న అతని చిన్న దేశం ఉత్పత్తి చేసే చమురువల్ల ఈ అపార సంపద లభిస్తున్నది అతనివద్ద 153 రోల్స్ రాయిస్ కార్లు ఉన్నాయి*

—"ఫార్చ్యూన్" సౌజన్యంతో

## నిఘంటువు!

*గొప్ప హాస్య రచయిత మార్క్‌ట్వైన్ ఒకసారి ఒక ఉపన్యాసం వినేందుకు వెళ్ళాడు ట్వైన్ వక్తను అభినందిస్తూ "అయ్యా మీ ఉపన్యాసం గొప్పగా ఉంది కానీ నామాట నమ్మండి, మీరు మాట్లాడిన ప్రతిమాట ఇంతకుముందు ఒక పుస్తకంలో వ్రాసినదే" అని చెప్పాడు హాస్యకుశలత లేని ఆవక్త ఆపుస్తకం కావాలని అడిగాడు అతడు ఇంటికి చేరగానే ఆపుస్తకం కూడా అందింది అతడు ఆశ్చర్యంతో దాన్ని తెరిచాడు, అదొక నిఘంటువు (డిక్షనరీ)!*

# మీకు తెలుసా?

## బొంబాయికి ఆ పేరు ఎలా వచ్చింది?

బొంబాయికి చెందిన ఏడు దీవుల్లో తొలిగా నివసించిన కోలీల పోషక దేవత ముంబ - ఆయై (మూలం) నుండి బొంబాయి వచ్చింది

## బొంబాయి మొట్టమొదటి కారు



మొట్టమొదటగా బొంబాయిలోకి 1901లో కారు, 1907లో ఎలక్ట్రిక్ ట్రాములు మరియు 1926లో ప్రయాణీకుల బస్సులు వచ్చాయి

## పురుగుల జనాభా

జంతువుల రాజ్యంలో పురుగులు 4/5 వంతులు ఉంటాయి

## అంబులెన్స్ వాడిన మొదటి వ్యక్తి

1796-97లో ఇటాలియన్ యుద్ధ సమయంలో రణ భూమి నుంచి క్షతగాత్రులను తీసుకువెళ్ళటానికి అంబులెన్స్‌ను ఉపయోగించిన మొదటి వ్యక్తి ఫ్రాన్స్‌కు చెందిన నెపోలియన్ బోనపార్టీ

## దుంపల్లో చక్కెర

చక్కెర (బీటు) దుంపల్లో చక్కెరను జర్మన్ రసాయన శాస్త్రజ్ఞుడు సిగిస్మండ్ మార్గ్రఫ్ (1709-82) కనుగొన్నాడు

## ప్రపంచంలో విశాలమైన ఉద్యానవనం

ఆల్బెర్టా (కెనడా)లోని ది ఉడ్ బఫెలో నేషనల్ పార్క్ 45,480 చ కి మీల విస్తీర్ణంతో ప్రపంచంలోనే విశాలమైన ఉద్యానవనంగా రూపొందింది

## ఇండియాలో ప్రథమ న్యూస్ రీడర్

ఇండియాలో టీవీలో వార్తలు చదివిన మొదటి వ్యక్తి ప్రతిమా పూరి

## పన్నుల వాటా నిర్ణయించే ఫైనాన్స్ కమిషన్

భారత రాజ్యాంగం ప్రకారం కేంద్రం, రాష్ట్రాల మధ్య విభజించదగిన పన్నుల వాటాను ఫైనాన్స్ కమిషన్ నిర్ణయిస్తుంది

## రెక్కలుగా ఉపయోగపడే పాదాలు

జావా (ఇండోనీషియా)లోని ఎగిరే కప్పలు చెట్ల మీద నివసిస్తూ తమ సన్నని చర్మంతో కూడిన పాదాలను రెక్కలుగా ఉపయోగించుకుని ఎత్తైన చెట్ల మీదకు ప్రాకిపోతుంటాయి

## పెడగోగీ అంటే ఏమిటి?

పెడగోగీ - ఉపాధ్యాయ వృత్తికి సంబంధించిన బోధనా శాస్త్రం

“నీవు డబ్బును ఉంచుకో (దాచుకో) కాని డబ్బు

## ద్రోణాచార్య అవార్డు

వరుసగా మూడు సంవత్సరాలపాటు నిశ్చలతతో (స్థిరంగా) శ్రేష్ఠమైన పని నిర్వహించిన కోచెస్ (తర్ఫీదు చేసేవారు)కు ద్రోణాచార్య అవార్డులు ఇస్తారు

## ఇండియాలో మొదటి ఐస్‌క్రీమ్ కంపెనీ

ఎల్ సి జావా 1948లో ఇండియాలో మొదటి ఐస్‌క్రీమ్ కంపెనీ - జాయ్ ఐస్‌క్రీమ్ ప్రైవేట్ లిమిటెడ్ - స్థాపించాడు

## మాస్ట్రిట్చ్ ఒప్పందం

యూరప్ ఆర్థిక, రాజకీయ ఏకీకరణకు సంబంధించినది - మాస్ట్రిట్చ్ ఒడంబడిక

## రోదసిలో నడిచిన మొదటి వ్యక్తి

1965 మార్చి 18న రోదసిలో నడిచిన మొట్టమొదటి వ్యక్తి - సోవియెట్ యూనియన్‌కు చెందిన వ్యోమగామి - అలెక్సయ్ లియోనోవ్

## ప్రపంచంలో పెద్ద కాండోమ్ ఉత్పత్తి సంస్థ

ప్రపంచంలో పెద్దదైన కాండోమ్ (Condom) ఉత్పత్తి సంస్థ త్రివేండ్రం (కేరళ)లోని హిందుస్థాన్ లాటెక్స్ లిమిటెడ్

## ప్రపంచంలో విస్తృతంగా వాడే మందు

హాఫ్‌మాన్ - లారోచ్ కొత్తగా కనిపెట్టిన మందు వాలియం-బెంజోడయాజోపిన్ గ్రూప్ వారి శాంతపర్చే ఔషధం - ప్రపంచంలో విస్తృతంగా ఉపయోగిస్తున్న మందు

## యురేనియం - అసాధారణ శక్తి

ఒక కిలోగ్రామ్ యురేనియంలో కిలోగ్రామ్ బొగ్గు శక్తి కంటే దాదాపు 3 మిలియన్ రెట్లు శక్తి ఎక్కువగా ఉంటుంది

## "ది గ్రేట్ ట్రైన్ రాబరీ"

ఒక కథను వాస్తవ రూపంలో చెప్పిన మొదటి చిత్రాన్ని 1903లో ఎడిసన్ లేబొరేటరీలో నిర్మించారు అదే "ది గ్రేట్ ట్రైన్ రాబరీ"

## యుఎస్‌ఏలో పెద్ద రాష్ట్రం

యుఎస్‌ఏలో పెద్ద రాష్ట్రం అలాస్కా. టెక్సాస్ - రెండవది

## ప్రపంచంలో పెద్ద సముద్రపు పక్షి



ALBATROSS

*ఫ్రెంచి అటవీ సంరక్షకులు అల్‌బట్రాస్ అనే ప్రపంచంలో పెద్దదైన ఎగిరే సముద్రపు పక్షిని కనుగొన్నారు గంటకు 85 కి మీ ల వేగంతో ఇది పయనిస్తుంది దేశద్రిమ్మరులుగా తిరుగుతున్న కొన్ని అల్‌బట్రాస్ పక్షులను అనుసరించేందుకు వీరు ఉపగ్రహం ఉపయోగించి, 33 రోజుల్లో 16,000 కి మీ లు ఈ పక్షులు ప్రయాణం చేసాయని కనుగొన్నారు*

"ఏదైనా కష్టపెడుతున్నట్లయితే ఈ క్రింది నీతిని మననం చేసుకో ఈ దుర్ఘటన దురదృష్టం కాదు, కానీ దీన్ని భరించగలగడం వల్ల ఇది

## స్వామి గణపతి సచ్చిదానంద

చాలాకాలం క్రిందట చక్రవర్తి శివాజీ మహారాష్ట్ర రాజ్యాన్ని పరిపాలిస్తుండేవాడు ఒకసారి తన ఆధ్యాత్మిక గురువైన, యోగి సమర్థ రామదాసుతో కలిసి సజ్జన్‌గడ్‌లో తన కోట నిర్మాణ స్థలానికి వెళ్ళాడు తన ఆజ్ఞ మేరకు వేలాది ప్రజలు కోట నిర్మాణపు పనులు చేస్తుండటం గమనించాడు అతని మనసు గర్వంతో ఉప్పొంగింది అప్పుడు తనలో తానే ఇలా భావించాడు "పని ఇవ్వటం ద్వారా



వేలాది కుటుంబాలను నేను పోషిస్తున్నాను ఈ ప్రజలంతా నా మీద ఆధారపడినవాళ్ళే, నేను ఎంతో గొప్పవాణ్ణి''

శివాజీ మనసును సమర్థ రామదాసు చదవగలడు అతని గర్వం నశింపచేయదలచి అక్కడ ఉన్న ఒక బండరాయిని పగలగొట్టమని, పనివారికి ఉత్తర్వులివ్వమని శివాజీని కోరాడు శివాజీ తక్షణమే గురువుగారి ఆజ్ఞ పాటించాడు ఆ రాయి రెండుగా పగలగానే, శివాజీకి విస్మయం కలిగించేటట్లు - ఆ రాతిలో ఒక బోలుగా (గుంటగా) ఉన్నచోట కొద్ది నీటిలో ఒక కప్ప నివసిస్తూ కనిపించింది స్వామి రామదాస్ శివాజీ వైపు తిరిగి ప్రశ్నించాడు "శివాజీ, అక్కడ కప్ప జీవించేందుకు స్థలం, నీరు సమకూర్చిన వ్యక్తివి నీవేనా? కప్పకు రక్షణ, ఆహారం ఏ విధంగా ఇవ్వగలిగావు? ఇది నిజంగా అద్భుతంగా ఉంది''

తన గురువు అన్న మాటల్లోని అర్థాన్ని శివాజీ గ్రహించాడు తన అజ్ఞానాన్ని తెలుసుకున్నాడు అతని చెంపల వెంట అశ్రువులు క్రిందికి జారాయి అత్యంత నమ్రతతో మోకరిల్లి చెప్పాడు "అయ్యా! కప్పకు రక్షణ కానీ, ఆహారం కానీ నేను సమకూర్చింది కాదు అది భగవత్కార్యమే నా అజ్ఞానం వల్ల నేను గొప్ప రాజుననీ, తమ జీవనాధారం కోసం వేలాది ప్రజలు నాపై ఆధారపడ్డారనీ భావించాను నాతో సహా ప్రతి ప్రాణీ కేవలం దేవుని అనుగ్రహం వల్లనే జీవిస్తున్నాయని ఇప్పుడు నేను అర్థం చేసుకున్నాను నా అజ్ఞానానికీ, మూఢత్వానికీ, గర్వానికీ దయతో నన్ను క్షమించండి''

నీతి ఏ కార్యసిద్ధికైనా గర్వపడకూడదు

—'సప్తగిరి' సౌజన్యంతో

## పి అజిత్

హాబీ (ఇష్టమైన పని, సరదా)- అనేది తీరిక సమయంలో చేసే ఇష్టమైన వృత్తి వ్యక్తిత్వ వికాసానికీ, స్వీయాభివృద్ధికీ తోడ్పడే వాటిల్లో హాబీలు కూడా ఒక విధంగా - సాధనాలు మనలో బ్రహ్మాండమైన శక్తి సామర్థ్యాలు నిక్షిప్తంగా ఇమిడి ఉన్నాయి



వాటిని మేల్కొల్పనంతకాలం, అవి నిద్రాణంగా ఉండి మనకు ఏమాత్రం ఉపయోగపడకుండా ఉంటాయి వాటిని ప్రేరేపించినట్లయితే ఎన్నో ద్భుత కార్యాలు చేస్తాయి ఈ విదంగా లోపల దాగిన శక్తి సామర్థ్యాలను హాబీలు మేల్కొల్పుతాయి ప్రపంచంలో లలిత కళల్లో విఖ్యాతి పొందిన అనేకమంది వ్యక్తులు తమ పనుల్ని హాబీలతోనే ప్రారంబించారు అనంతరం, వారు తమలో దాగిన శక్తి సామర్థ్యాలను అబివృద్ధి చేసుకుని వృత్తిపరమైన రచయితలుగా, గాయకులుగా, రంగులు వేసే చిత్రకారులుగా, శిల్పులు మొదలైనవారుగా తయారయ్యారు

హాబీలను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. పనులు చేయటం, పనితనంతో వస్తువుల్ని తయారు చేయటం, వస్తువుల్ని సేకరించటం మరియు వస్తువుల్ని గురించి తెలుసుకోవటం

* పనులు చేయటం

సామాన్య జనానికి అత్యంత ఆచరణీయమైన హాబీగా దీన్ని చెబుతారు దీనికయ్యే ఖర్చు అతి స్వల్పం దీనిలో - తోటపని, నడక, కుస్తీ మొదలైనవి చేర్చబడ్డాయి మరియు ఎన్నో రకాలైన ఇండోర్, ఔట్‌డోర్ గేముల్ని కూడా చేర్చారు

మానవుని పురాతనమైన హాబీ - తోటపని చాలా ఆసక్తిదాయకంగా, లాభకరంగా ఉంటుంది మనం ఎన్నో రకాల మొక్కల్ని పెంచవచ్చు ఇవి పండ్లను ఇచ్చేందుకు లేదా ఇవి అందంగా పూచి వికసించి పుష్పించేందుకు, మరియు ఆకులకోసం పెంచబడుతున్నాయి ఎవరైనా అనేక రకాల ప్రాణుల్ని పెంపుడు జంతువులుగా దగ్గరకు తీయవచ్చు - కుక్కలు, కుందేళ్ళు, పిల్లులు, పక్షులు, చేపలు వగైరా

## సిద్ధంగా ఉన్నాను!

*అమెరికా అధ్యక్షుడు ఉడ్రో విల్సన్‌ను 10 నిమిషాల ఉపన్యాసం తయారు చేసేందుకు ఎంతకాలం పడుతుందని ఒక మిత్రుడు ప్రశ్నించాడు "రెండు వారాలు" అని జవాబిచ్చాడు విల్సన్ "ఒక గంట ఉపన్యాసానికి ఎంతకాలం పడుతుంది?" అన్న ప్రశ్నకు "ఒకవారం" అని విల్సన్ జవాబు "రెండు గంటల ఉపన్యాసానికైతే ఎంతకాలం?" అని ప్రశ్నించగా "నేను ఇప్పుడే సిద్ధం" అని విల్సన్ జవాబిచ్చాడు*

---

"మనకు వార్తాపత్రికలు లేని ప్రభుత్వం కావాలో లేక ప్రభుత్వం లేని

* వస్తువుల్ని సృష్టించటం

ఇది కూడా హాబీగా ఎంతో ప్రజాదరణ పొందినదే ఇది 'సృజనాత్మక సరదా' అని కూడా పిలువబడుతున్నది కొయ్య, మట్టి, రాయి మొదలైనవాటిని అందమైన వస్తువులుగా కొందరు తమ హస్తాలతో తయారు చేస్తారు వస్త్రం, కాన్వాస్, చాపలు వంటివాటిమీద అందమైన డిజైనులు వేస్తారు ఇటువంటి హాబీలు మళ్ళీ రెండు రకాలుగా విభజించబడ్డాయి హస్తకళలు మరియు లలితకళలు

* వస్తువుల్ని సేకరించటం

ఇది చాలా సామాన్యమైన హాబీ - తపాలా బిళ్ళలు, నాణాలు, చాయా చిత్రాలు, పురాతన వస్తువులు వగైరా సేకరణ దీనిలో చేరాయి ఇది ఒక వ్యక్తికి వస్తువులపై లోతైన, సంపూర్ణమైన అవగాహన కలిగిస్తుంది

* వస్తువులను గురించి నేర్చుకోవటం

ఈ రంగం చాలా విస్తృతమైనది అన్ని హాబీలు ఏదో విధంగా దీనిలో చేరినవే ఉదాహరణకు మనం ఒకపని చేసినపుడు - అది తోటపని అనుకుందాం - మనం మొక్కల జీవితం గురించి ఎన్నో విషయాలు నేర్చుకుంటాము 'రచన' అనే సృజనాత్మకమైన పనిని మనం నిర్వహించినపుడు మన బావాలను, గమనింపులను, ప్రతిబింబాలను వెలిబుచ్చే ప్రయత్నంలో మనం ఎంతో నేర్చుకుంటాము మనం వస్తువులను సేకరిస్తున్నపుడు మనం సేకరించిన వాటి సహజ గుణాల్ని గురించి ఎక్కువగా తెలుసుకుంటాము

ఒకవ్యక్తి హాబీని ఎంపిక చేసుకునేటప్పుడు, తన పర్యావరణానికి బాగా అనుగుణమైనదానినే హాబీగా ఎంచుకోవాలి దీనివల్ల అతనికి అత్యంతానందం లభిస్తుంది దీనిద్వారా అతడు పూర్తిగా అభివృద్ధి చెంది తన వ్యక్తిత్వంలోని విభిన్నస్థితులను పెంపొందించుకోగలుగుతాడు

తనకు తగినంతగా సుఖాన్ని, సంతోషాన్ని సమకూరుస్తున్నంతకాలం ప్రతి వ్యక్తీ ఒక హాబీని కొనసాగిస్తూనే ఉండవచ్చు కొందరు తమ జీవితకాలమంతా ఒకే ఒక హాబీతో ఉంటారు మరికొందరు తమ జీవితంలో వివిద మట్టాలలో వివిధ హాబీలు పెట్టుకుంటారు తన జీవిత పరిస్థితులు మారినప్పుడూ, తను అబివృద్ధి చెందినప్పుడూ ఒక వ్యక్తి తన హాబీని మార్చుకోవచ్చు

## మిత్రత్వానికి పది సూచనలు



మీ ఆరోపణలను బాగా కుదించి వేయండి
తగవులాటల నుంచి పోట్లాటల నుంచి వైదొలగండి
చాతుర్యంతో, సహనంతో ఉండండి
మర్యాదగా, సదవగాహనతో ఉండండి
మీ వ్యక్తిగత రూపాన్ని అభివృద్ధి చేసుకోండి
అహంబావాన్ని చేరనీయకండి
మీపని చేసుకుని పోవటం నేర్చుకోండి
విలువను గ్రహించండి, నిస్వార్థంగా ఉండండి
సంతోషంతో ఉండండి, అనుకూలంగా ఉండండి
మిత్రుని వలే ఉండండి

—'హిప్నోటిక్' సౌజన్యంతో

న్యూజెర్సీ (యుఎస్ఎ)లోని న్యూ బ్రన్స్‌విక్‌లో గల రట్జర్స్ యూనివర్శిటీ కాలేజ్ ఆఫ్ అగ్రికల్చర్ లేబొరేటరీలో 28 సంవత్సరాలపాటు డాక్టర్ సెల్మన్ ఏ వాక్స్‌మన్ మానవాళికి ఉపయోగపడే విధంగా మట్టిలో మైక్రో - ఆర్గనిజమ్స్ కోసం వెదుకుతూ శోధన నాళికలను (టెస్ట్‌ట్యూబ్స్) పరిశోధించాడు ఎన్నో నిరాశా నిస్పృహల తరువాత అతడు ఆఖరికి ప్రాణరక్షక ఔషధాలలో ఒకటైన పెన్సిలిన్‌కు చేరువలోకి వచ్చే అద్భుత ఔషధం - స్ట్రెప్టోమైసిన్ - విజయవంతంగా కనుగొన్నాడు


DR SELMAN WAKSMAN

1888 జూలై 2వ తేదీన ప్రిలుకా అనే ఒక రష్యా గ్రామంలో డాక్టర్ వాక్స్‌మన్ జన్మించాడు అతని తండ్రి రాగితో వంట పాత్రలు తయారు చేసేవాడు యువకుడుగా వాక్స్‌మన్ మనస్సులో బయాలజీ గాఢముద్ర వేసింది 1910లో అతడు అమెరికాకు వలస వెళ్ళాడు మైక్రోబయాలజీని ఎంపిక చేసుకుని రట్జర్స్‌లోని వ్యవసాయ కళాశాలలో చేరాడు 1915లో పట్టభద్రుడయ్యాడు 1918లో యూనివర్శిటీ ఆఫ్ కాలిఫోర్నియా నుంచి పిహెచ్‌డి స్వీకరించాడు అనంతరం రట్జర్స్‌లో అధ్యాపకుడుగా, పరిశోధకుడుగా చేరాడు శాస్త్ర విజ్ఞానం తరువాత వాక్స్‌మన్‌కు ఏకైక అభిరుచి సంగీతంలోనే

డాక్టర్ వాక్స్‌మన్ ఆంటీ (సూక్ష్మజీవినాశికాలు)లో గాఢమైన ఆసక్తి చూపాడు గ్రామ్ - నెగటివ్ బాక్టీరియా అని పిలువబడుతున్న ఒక బాక్టీరియా వర్గానికి వ్యతిరేకంగా పెన్సిలిన్ నిరుపయోగంగా ఉన్నదని అతడు కనుగొన్నాడు గ్రామ్‌పాజిటివ్ బాక్టీరియాకు మాత్రమే అది శక్తివంతంగా పని చేస్తున్నదని తెలుసుకున్నాడు

అతడు, అతని సహాయకులు కొన్నివేల మైక్రోబియల్ కల్చర్స్ (సూక్ష్మజీవుల ఉత్పాదనలు) విడదీసి, స్వచ్ఛపర్చి, పరీక్షలు చేశారు

మట్టిలో అతడు కనుగొన్న కొన్ని సూక్ష్మజీవులు అభివృద్ధికి రాదగినవిగా కనిపించినా, మానవ క్రిములపట్ల నిరర్థకమని ఋజువయ్యాయి కొన్ని ఇతర సూక్ష్మజీవులు వ్యాధుల్ని నశింపజేసే

## స్వచ్ఛ జలంగా మారె మురికినీరు

***కాలిఫోర్నియా (యుఎస్ఎ) లోని లాస్ ఏంజిల్స్ సమీపంలోని ఆరెంజ్ కౌంటీ గృహ ప్రాంతంలోని ఒక నీటి కర్మాగారం 57 మిలియన్ లీటర్ల మురికి నీటిని ప్రతిరోజూ ప్రజల ఉపయోగం కోసం స్వచ్ఛమైన నీరుగా మారుస్తుంది***

"వారికి తెలియనిది మనుషులకు బోధించటం విద్య కాదు వారికి

సామర్థ్యం కలిగినవే కానీ ఇవి మానవులకు ప్రమాదకారులుగా ఋజువయ్యాయి 1941లో ఒక విశ్వ విద్యాలయాదికారి - డాక్టర్ వాక్స్‌మన్ సంవత్సరానికి 4,620 డాలర్లు తీసుకుంటున్నాడని, అతని పరిశోదనలో ఏవిధమైన బవిష్యత్తు కనిపించటంలేదని, కనుక ఉద్యోగం నుంచి తొలగించాలని కోరటం జరిగింది కాని అతని సలహా యూనివర్శిటీ పాటించలేదు

1943లో డాక్టర్ వాక్స్‌మన్ బారీగా ఎరువులు వేసిన నేల నుంచి ఒక జీవిని వేరుపరచి అత్యంత సమర్ధతకల అంటిబయొటిక్స్‌ను కనుగొన్నాడు ఆజీవి 'స్ట్రెప్టోమైసిస్ గ్రిసియెస్' సంతతిగా, క్రిమినాశనకారులుగా తెలుసుకున్నాడు శోదన నాళికలో వారు అత్యంత కఠినమైన వ్యాదికారక క్రిములుగా పేరొందిన - ట్యూబర్‌కిల్ బసిలస్ - ను నశింపజేశారు

- ఆంటిబయొటిక్స్‌కు ఆయన పెట్టిన పేరు - తో ప్రయత్నించి, అది అత్యంత విలువైనదిగా ఋజువు చేశారు అది క్షయ వ్యాది నివారణకు శక్తివంతమైన ఆయుధంగా నిల్చింది న్యూమోనియా, అతిసారం, కోరింత దగ్గు మరియు గనేరియాలకు కూడా పనికి వచ్చింది మనిషికి హాని కలిగించకుండానే వారికి హాని కలిగించే సూక్ష్మక్రిములను చంపటం ఆదునిక అద్భుతం

అంటిబయొటిక్ స్ట్రెప్టోమైసిన్ కనిపెట్టినందుకు డాక్టర్ వాక్స్‌మన్‌కు 1952లో ఫిజియాలజీ మరియు మెడిసిన్‌కు సంబందించిన నోబెల్ బహుమతి లబించింది 1946లో రెడ్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో సభ్యత్వం, మరియు 15,000 రూబుల్స్ బహుమతి ఇచ్చి రష్యన్లు అతణ్ణి సన్మానించారు స్ట్రెప్టోమైసిన్ కనిపెట్టినందువల్ల తనకు లభించిన ధనంతో వ్యాదినిరోదక సౌకర్యాలుకల రట్జర్ యూనివర్శిటీలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మైక్రోబయాలజీ భవనం నిర్మించేందుకు డాక్టర్ వాక్స్‌మన్ తోడ్పడ్డారు

డాక్టర్ వాక్స్‌మన్ 1973లో కాలదర్మం చెందాడు

## మనీకి మూలం



'మనీ' అనేమాట రోమన్ దేవత - జునో మొనిటా నుంచి గ్రహించబడింది ప్రాచీన రోమ్ నగరంలో ఒకబిడ్డ జన్మించగానే ప్రతి పౌరుడు జునో దేవాలయంలో ఒక విలువైన లోహపు తునకను నిక్షేపించటం పరిపాటి అత్యవసర పరిస్థితి ఏర్పడి యుద్ధం సంభవించినప్పుడు ఈ లోహాలను ఉపయోగించి మొదటి నాణాలను టంకసాలలో ముద్రించేవారు

*ప్రాచీన గ్రీస్ దేశంలో రొట్టెలు కాల్చేవారు (Bakers) ప్రత్యేక సదుపాయాలు పొందేవారు వీరు ప్రత్యేక పాఠశాలల్లో విద్య గడించేవారు ప్రాచీన రోమ్‌లో రొట్టెను కాల్చుగల ఒక బానిస - ఒక యుద్ధ వీరుని కంటే 10 రెట్లు విలువ (యోగ్యత) కలవారుగా ఉండేవారు*

*— 'స్పుట్నిక్' సౌజన్యంతో*

## సురేంద్ర

18వ శతాబ్దిలో ప్రష్యాను పాలించిన ఫ్రెడరిక్ రాజును పొడవైన వ్యక్తులు ఆకర్షించేవారు అతడు యూరప్‌లోని వివిధ ప్రాంతాల నుండి పొడవైన వ్యక్తుల్ని సైన్యంలో చేర్చుకుని ఒక కొత్త సైనిక దళాన్ని తయారు చేశాడు



అయితే యుద్ధంలో వారు సమర్థులుగా ఋజువు చేసుకోలేకపోయారు ఓడిపోయే వారిలో మొదటివారుగా ఉండేవారు క్రమేణా వీరికి భరతవాక్యం పలికారు

అనేక సంవత్సరాలక్రితం ఇండియాలో ప్రతివారూ చెప్పుకునే పొడవైన వ్యక్తి - సునీల్ పాండా అతడి ఎత్తు 7 అడుగుల 3 అంగుళాల మేరకు ఉండేది అతడు పశ్చిమ బెంగాల్‌లోని ఝూర్ గ్రామంలో జన్మించాడు బి ఎస్‌సి చదివాడు 1969లో పోలీస్ దళంలో చేరాడు ప్రపంచంలోని పొడవైన పోలీస్‌గా పేరొందాడు 18 అంగుళాల పొడవు, 7 అంగుళాల వెడల్పు ఉండే అతని పాదాలకు సరిపోయే పాదరక్షలు మార్కెట్‌లో లభించేవికావు

ఇండియాకు చెందిన మరో పొడుగు మనిషి - మన్సూ కలూ ఇతని ఎత్తు 7 అడుగుల 4 అంగుళాలు ఇతడు నాసిక్ (మహారాష్ట్ర)కు చెందినవాడు ఇతడు 1965లో చనిపోయాడు

1971లో తిల్యా అనే పేరుగల స్త్రీ ఉండేది 25 ఏళ్ళ వయస్సులో ఆమె 7 అడుగుల 6 అంగుళాల ఎత్తు ఉండేది ఆమె బీహార్‌లోని పలము పట్టణానికి చెందినది ఆమె ముక్కు 7 అంగుళాల వెడల్పుతో ఉండేది ఆమె అఱచేయి ౬ అంగుళాల వెడల్పుతో ఉండేది ఆమె పాదాలు 18 అంగుళాలు ఉండేవి ఆమె వ్రేళ్ళ పొడవు 5 నుంచి 9 అంగుళాల మేరకు ఉండేది




బ్రిటిష్ చరిత్రలో పొడవైన వ్యక్తి - ఎడ్వర్డ్ బ్రైట్ అతని సూటుకు 12 5 మీటర్ల గుడ్డ కావల్సి వచ్చేది వీపుమీద ఇద్దరిని ఎక్కించుకుని గంటల తరబడి ఈదేవాడు!

'భావనకు ఉడుపు (దుస్తులు) - భాష.'' — శామ్యూల్ జాన్సన్

ఇటీవలి సంవత్సరాలలోని పొడవైన వ్యక్తి యుఎస్ఏకి చెందిన రాబర్ట్ వాడ్లో అతని ఎత్తు 9 అడుగుల 9½ అంగుళాలు, బరువు 411 పౌండ్లు 1905లో లండన్‌లో నివసించిన ఫైద్దన్ మాల్‌కినోవ్ ఎత్తు 9 అడుగుల 3 అంగుళాలు జర్మనీకి చెందిన ఒక మల్లయోదుని ఎత్తు 8 అడుగులు, బరువు 700 పౌండ్లు

ఆధునిక చరిత్రలో పొడవైన స్త్రీ - సెంట్రల్ చైనాలో హనాన్ రాష్ట్రంలోని బ్రైట్‌మూన్ కమ్యూన్‌కు చెందిన యుజియాంగ్ గ్రామనివాసి అయిన జెంగ్ జిన్‌లియాన్ అమె ఎత్తు 8 అడుగుల $1^3/_4$ అంగుళాలు ఆమె 1982 ఫిబ్రవరి 13న మరణించింది




ప్రస్తుతం ప్రపంచంలో పొడవైన మహిళ - యుఎస్ఏ ఇల్లినాయిస్‌కు చెందిన చికాగోలో నివసిస్తున్న శాండీ అలెన్ ఆమె 7 అడుగుల $7^1/_4$ అంగుళాల ఎత్తు కలిగి, 209 5 కేజీల బరువుతో ఉంటుంది 16 సైజు పాదరక్షలు ధరిస్తుంది

ప్రస్తుతం ప్రపంచంలోని పొడవైన పురుషులు - పాకిస్తాన్‌కు చెందిన హాజీ మహమ్మద్ అలం చన్నా మరియు సూడాన్‌కు చెందిన బాస్కెట్‌బాల్ క్రీడాకారుడు మాన్యూట్ బోల్ వీరి ఎత్తు దాదాపు 7 అడుగుల $7^1/_4$ అంగుళాలు ఉంటుంది బంగ్లాదేశ్‌లోని ఢాకాకు చెందిన చంద్రాబర్మన్ 8 అడుగుల 3 అంగుళాల ఎత్తుతో ఉంటాడు ఇతడు ఇంకా పెరిగిపోతూనే ఉన్నాడు!




ప్రస్తుతం ఇండియాలో పొడవైన వ్యక్తి భోపాల్ (మధ్యప్రదేశ్)కు చెందిన మంగళ్ సింగ్ ఇతడి ఎత్తు 7 అడుగుల 6 అంగుళాలు ఇతడు ఇప్పుడు మధ్యప్రదేశ్ స్పెషల్ ఆర్మ్‌డ్ ఫోర్స్‌లో కాన్‌స్టెబుల్‌గా పని చేస్తున్నాడు మరో పొడవైన వ్యక్తి - జంషెడ్‌పూర్ (బీహార్)లో నివసిస్తున్న 7 అడుగుల 4 అంగుళాల ఎత్తుగల జితేంద్రసింగ్

## ప్రపంచ నగరాల్లో అతి చౌక నగరం

ప్రపంచంలోని ప్రముఖ నగరాల్లో నివాసానికి అతిచౌక అయిన నగరం బొంబాయి

—'యూనియన్ బాంక్ ఆఫ్ స్విట్జర్లాండ్' సౌజన్యంతో

'నీదగ్గర ఏదైనా ఉన్నంతవరకూ, ఏమీ లేనివారికి నీవు ఎంతో కొంత బాకీ పడినట్లే''

— వినోబా

## కె బి అయ్యర్

జాక్విలిన్ ట్రిబేట్ అనే 39 సంవత్సరాల ఫ్రెంచి వనిత, 16 ఏళ్ళ క్రితం చనిపోయిన ఒక వ్యక్తిని వివాహం చేసుకున్నదనే ఆసక్తి కరమైన వార్తావిశేషాన్ని కొన్నేళ్ళ క్రిందట ప్రపంచంలోని వార్తాపత్రికలన్నీ ప్రచురించాయి



పశ్చిమ ఫ్రాన్స్‌లోని ఒక పట్టణంలో 32 సంవత్సరాల సార్జెంట్ - జోసెఫ్ బౌనియవ్రూ - అతనికి భార్యగా నిశ్చయం అయిన వనిత, అదే వయస్సు గల కామెలీ రాబోయే సెలవుల్లో వివాహం చేసుకోవాలని పథకం వేసుకున్నారు సైనిక దళాధిపతుల అనుమతి లభించిన తరువాత ఉత్తర ఆఫ్రికన్ టెరిటరీ యుద్ధంలో అతడు చంపివేయబడ్డాడు

ఉత్తర ఆఫ్రికాలో శాంతి భద్రతల పరిరక్షణలో మరణించిన సైనికులు, నావికులు - మరణించిన తరువాత కూడా - అంతకు క్రితమే వారికి వివాహ నిశ్చితార్థం జరిగి నట్లయితే - వివాహం చేసుకోవచ్చుననే ప్రభుత్వ చట్టం ప్రకారం మిస్ కామెలీ అధికారులను కలుసుకుని తన వివాహం జరగాలన్న అభిమతం వెలిబుచ్చింది అతి త్వరలోనే మరణించిన భర్తతో ఆమె వివాహం జరిగి పోయింది

కొన్ని బ్రాహ్మణ తెగలలో మూడవ పెండ్లి చేసుకున్నట్లయితే ఆ వధువు విధవరాలవు తుందనే మూఢ నమ్మకం ఉంది ఈ దుర దృష్టాన్ని అరికట్టేందుకు వరుడు మొదటగా ఒక అర్క వృక్షాన్ని వివాహం చేసుకుంటాడు ఆ విధంగా తాను వివాహమాడిన స్త్రీ నాలుగవ భార్య అవుతుంది సాధారణంగా వివాహ కార్యకలాపాల్లో జరిగినట్లే పౌరోహితుడు వేద మంత్రాలు, శ్లోకాలతో అర్కవృక్షాన్ని సంబోధిస్తాడు వివాహానంతరం ఆ మొక్కను నరికివేస్తారు

ఇండియాలోని కొన్ని తెగలలో ఒక భార్యా విహీనుడు రెండవసారి వివాహం చేసు కుంటున్నప్పుడు మొదటి భార్య ఆగ్రహం నుంచి తప్పుకునేందుకు ఆమె ప్రతిబింబాన్ని మెడలో కట్టుకుంటాడు తన కొత్త భార్యకు ఏదైనా కానుక ఇవ్వదలచినప్పుడల్లా ఆ కానుకను ముందుగా మెడలో ఉన్న మొదటి భార్య ప్రతిబింబానికి సమర్పిస్తాడు

### ఇండియాలో పులులు, సింహాలు

*ఇండియాలో ప్రస్తుతం 4,334 పులులు, 6,763 చిఱుతపులులు, 239 సింహాలు, 13 000 నుండి 15,000 వరకు అడవి ఏనుగులు మరియు 1,600 ఖడ్గమృగాలు ఉన్నాయి*

— *(1989 వైల్డ్ ఆనిమల్ లెక్కలు)*

"ముఖానికి వెలుగునిచ్చే మందహాసం వ్యాధులకి ఊరట ఇస్తుంది కనుక చిరునవ్వులు చిందిస్తూ ఉండు"

ఆర్ సి రాజామణి

ఆధునిక పారిశ్రామిక సమాజంలో బాల కార్మికవర్గం - ఒక దుఃఖపూరితమైన వాస్తవం

ప్రపంచ వ్యాప్తంగా100 నుంచి 200 మిలియన్ బాలకార్మికులు ఉన్నారని బోగట్టా వర్ధమాన దేశాలలో 18 శాతం పైగా పిల్లలు 10 నుంచి 14 ఏళ్ళ వయస్సులోని వారు - బాల కార్మికులుగా పనిచేస్తున్నారు దారిద్ర్యం - దీనికి ప్రధాన కారణం మరొకపని చేసేందుకు లేనందు వల్లనే తరచుగా పిల్లలు ఊడిగం చేసారు



పాఠశాలలు అందుబాటులో లేవు - అవి సరిపోవు లేదా అవి అత్యంత ఖరీదు కలవిగా ఉంటాయి

''వెట్టిచాకిరి'' ముద్రపడిన పిల్లలు, లేదా కట్టు బానిసల పరిస్థితుల్లో పనిచేసేందుకు నిర్బంధించబడినవారు - అత్యంత అపాయం (ప్రమాదం) లో ఉంటారు కొందరు పేద తల్లిదండ్రులచేత ధనవంతులకు విక్రయించబడిన వారుగా ఉంటారు లేదా గృహనిర్బంధంలో ఇంటి నౌకర్లుగా లేదా వ్యభిచారులుగా మారి పనిచేస్తూ కేవలం ఖైదీలుగా మ్రగ్గుతూ ఉంటారు

చాకిరి చేసే పిల్లలు అపరిపక్వ దశలోనే వయోజనుల జీవితాన్ని గడుపుతారు వారు శారీరకంగా, భావావేశపరంగా, నైతికంగా మరియు తెలివితేటల రీత్యా - హాని పొందినవారై ఉంటారు వారికి మంచి భవిష్యత్తు సమకూర్చగల విద్యాభ్యాసమనే అవకాశాన్ని వారు కోల్పోతారు బాలకార్మికులు - వర్ధమాన దేశాలకే పరిమితం కాలేదు పారిశ్రామికాభివృద్ధి చెందిన దేశాలలో బాలకార్మికులకు జరుగుతున్న వృత్తిపరమైన గాయాల పెరుగుదల అందరికీ ఆందోళన కలిగిస్తున్నది

ప్రస్తుతం పిల్లలు కొత్తవీ, అత్యంత ప్రమాదకరమైనవీ అయిన పనులలోకి ప్రవేశ పెట్టబడుతున్నారు చదవటం తెలియని పిల్లలు, ప్రమాదాలు తెలుసుకోలేని పిల్లలు - రక్షణలేని సస్యరక్షణ మందులు చల్లిన పొలాలలో పనిచేస్తూ, వారు పని చేసిన చేతులతోనే భుజిస్తున్నారు వేలాది పిల్లలు చెత్త (పెంట)ను తొలగించి జీవిస్తున్నారు వీరు ఆస్పత్రులలోని వైద్యసంబంధమైన ఔషధాలను, రేడియో ఆక్టివ్ వ్యర్థ పదార్థాలను, లీకయ్యే బ్యాటరీలనూ - వాటివల్ల ఏర్పడే దుష్పరిమాణాలు తెలుసుకోకుండా తమ చేతులతో సేకరిస్తున్నారు

## బైజింగ్‌లో భూగర్భ నగరం

*బైజింగ్ (చైనా) లో నగరం అడుగున మరో నగరం ఉన్నది దానిలో స్టోర్సు రెస్టారెంట్స్, హెూటళ్ళు సినిమాలు, క్రీడా సౌకర్యాలు మరియు ఒక ఆస్పత్రి ఉన్నాయి చైనా రాజధానికి దిగువన 55 మీటర్ల వరకు మూడు స్థాయిల్లో ఈ భూగర్భం లోని పెక్కు భాగాల నిర్మాణం నిల్చి ఉంది ఈ భూగర్భ నగరానికి దాదాపు 90 ప్రవేశ మార్గాలు ఉన్నాయి*

''ప్రపంచంలో గెలుపొందేందుకు రెండేమార్గాలు ఉన్నాయి స్వయం పరిశ్రమ లేదా ఇతరుల తెలివితక్కువతనం ద్వారా''

గ్లాస్ మరియు లోహ ఉత్పత్తి కర్మాగారాల్లో పనిచేసే బాలకార్మికుల ఊపిరితిత్తులు - హానికరమైన పొగను పీల్చటం ద్వారా పూర్తిగా దెబ్బ తింటున్నట్లు ఒక శిశు ఆరోగ్య అధ్యయనం తెలియజేస్తున్నది తివాచీ పరిశ్రమలో పనిచేసే పిల్లలు ఎక్కువ గంటలు కూఋకుపోతూ కూర్చోటంవల్ల వారి శరీరాలు కురూపులుగా మారుతున్నాయి

ఇండియాలో దాదాపు 18 మిలియన్ పిల్లలు పాఠశాలలకు వెళ్ళవలసిన 14 సంవత్సరాల వయస్సు వరకు ఉన్నవారు చట్టం నిషేధించిన వివిధ వృత్తులలో కనిపిస్తారు వ్యవసాయ కార్మికులుగా అనేకమంది పిల్లలు ఆకర్షించ బడుతున్నారు మొత్తం బాలకార్మిక శక్తిలో ఇది 43 శాతంగా ఉంటుంది తివాచినేత, అగ్గిపెట్టెలు, మందుగుండు సామాన్ల తయారీ, బీడీల తయారీ - వంటివి చట్టవిరుద్ధంగా పిల్లల చేత పని చేయించుకుంటున్న వృత్తులలో కొన్ని

ఇండియాలో గ్లాస్ పరిశ్రమలో బాలకార్మికులకు- హానికరమైన పరిస్థితుల్లో, విరామం లేకుండా రోజుకు 14 గంటలు పనిచేస్తే - కేవలం 8 రూపాయలు వేతనంగా ఇస్తున్నారు

1973 అంతర్జాతీయ కార్మిక సమ్మేళనం - ప్రపంచ వ్యాప్తంగా పనిచేసే వారి కనీస వయస్సు 15 సంవత్సరాలుగా ఉండాలని సిఫార్సు చేసింది 20 ఏళ్ళ తరువాత, 1993లో 150 దేశాలు, ఇంకా దీనికి సమ్మతించ వలసి ఉంది

బాలకార్మికుల జాతీయ విధానంవల్ల బాలకార్మికులు కేంద్రీకృతమైన ప్రదేశాల్లో వారి సంక్షేమం కోసం కొన్ని ప్రాజెక్ట్సు సమకూర్చటం జరిగింది నిర్ణీత పద్ధతిలేని విద్యావిధానం, వృత్తి శిక్షణ, పౌష్టికాహార అనుబంధం, ఆరోగ్య రక్షణ వగైరాలపైన ప్రాథమిక అవసరాలకు సంబంధించిన ప్రత్యేక పాఠశాలలు బాలల సంక్షేమం కోసం నెలకొల్పబడ్డాయి 12,000 మంది బాలలకు వర్తిస్తున్న 200 లకు పైగా పాఠశాలలు గత రెండేళ్ళలో మంజూరు చేయబడ్డాయి

ఎన్నో చట్టాలు, అర్థవంతమైన పథకాలు ఉన్నప్పటికీ బాలకార్మికులు - భయానకంగా - పెరిగిపోతున్నారు దీనికి పరిష్కారం - దేశం యొక్క సత్వర ఆర్థికాభివృద్ధి, నిరక్షరాస్యత నిర్మూలన, అందరికీ ఆరోగ్య రక్షణ అందించటం వల్లనే సాధ్యమవుతుంది

— 'యోజన' సౌజన్యంతో



*పరిత్యాగపు బాధ్యత మరియు ఉద్రేకపూరిత భక్తి విశ్వాసాల వైపు ఆకర్షించబడటానికి మనం బాగా ఆసక్తితో ఉన్నట్లయితే "నేను" బదులు "మేము", "నాది" బదులు "మాది" అని ప్రత్యామ్నాయంగా మార్పుచేయవలసిన అవసరం ఉంది*

*— గాంధీజీ*

"పని యొక్క ముగింపు తలంపు కాదు, పనే - ఆ తలంపు ఎంత ఉత్తమంగా ఉన్నప్పటికీ" — థామస్ కార్లైల్

## పరంపరగా పది రేడియో టెలిస్కోప్స్

'వెరీ లాంగ్ బేస్‌లైన్ అర్రే' అని పిలువబడుతున్న పది రేడియో టెలిస్కోప్స్ నేడు ...ర్మాణంలో ఉన్నాయి ఇవి పూర్తి అయినప్పుడు ...రేబియన్ సముద్రంలోని యు ఎస్ వర్జిన్ ...లెండ్స్ నుంచి పసిఫిక్ సముద్రంలోని ...వాయ్ వరకు అంటెన్నా వ్యాపించటం జరుగుతుంది ప్రస్తుతం పొడవైన ఆప్టికల్ టెలిస్కోప్స్ ద్వారా సేకరిస్తున్న ప్రతిబింబాలను - ఈ 70 మిలియన్ డాలర్ ప్రాజెక్ట్ ద్వారా - లబ్ధి మూలం (factor) 100 వరకు అభివృద్ధి చేయవచ్చు

## వ్యోమయానంలో పెన్స్ వాడకం

అమెరికా వ్యోమగాములు తమ రోదసీ ప్రయాణంలో ఉపయోగించిన బాల్ పెన్స్ నమూనాలు ఇప్పుడు అమెరికాలో అమ్మకానికి లభిస్తున్నాయి ఒక వ్యక్తి నీటిక్రింద ఉన్నప్పటికీ ఈ బాల్ పెన్స్‌తో వ్రాసేందుకు వీలవుతుంది

రీఫిల్స్ మామూలు బాల్ పెన్స్ కంటే 3 లేక 4 రెట్లు హెచ్చుకాలం మన్నుతాయి మూడుమైళ్ళ పొడవుగల విషయాన్ని వ్రాసేందుకు ఒక్క రీఫిల్ చాలు

## లేజర్ సహాయంతో దంత చికిత్స

పిల్లల దంతాలలో సక్రమంగాలేని పెరుగుదలకు చికిత్స చేసేందుకు లెనిన్‌గ్రాడ్ వైద్యులు ఒక లేజర్‌ను ఉపయోగిస్తున్నారు ఈ లేజర్ ఉత్పత్తి చేసే హొలోగ్రాఫిక్ ప్రతిబింబాలు - దంతాల పెరుగుదల దిశనూ, వాటి స్థానభ్రంశాన్నీ డాక్టర్లు తెలుసుకునేందుకు తోడ్పడతాయి చిక్కులు రాకపూర్వమే తగిన విధంగా చక్కదిద్దేందుకు సహాయపడతాయి

## పిక్చర్ ట్యూబ్స్ లేకుండా టీవీలు

పిక్చర్ ట్యూబ్స్ లేని టెలివిజన్లను జపాన్ ఇప్పటికే ప్రవేశపెట్టింది ఒక యుద్ధ విమానంలోని కాక్‌పిట్‌లో తక్కువ స్థలాన్ని ఆక్రమించగలుగుతుంది కనుక అమెరికాలో కూడా ఈ సాంకేతిక పరిజ్ఞానాన్ని రక్షణ ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారు సెంట్రల్ ఎలక్ట్రో కెమికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ ప్రొఫెసర్ కె ఐ వాసు అభిప్రాయం ప్రకారం

## పార్లమెంట్ సమావేశాల వ్యయం



ఇండియా పార్లమెంట్ సమావేశ కార్యకలాపాలకు ప్రతి నిమిషానికి 2000 రూపాయలు దేశానికి వ్యయమవుతుంది

"నీవు ఎన్నో ముందు జాగ్రత్తలు తీసుకోవటమే - జీవితానికి ముఖ్యమైన ఆపద"

- ఇండియాలో ఈ సాంకేతిక పరిజ్ఞానం ఇంకా బాల్యదశలోనే ఉన్నప్పటికీ త్వరలోనే టెలివిజన్ సెట్స్ నుండి పిక్చర్ ట్యూబ్ మూల పదార్థాలను పూర్తిగా తొలగిస్తామని చెప్పారు

## రాతిలో చెక్కిన గుహల శోధన

మహారాష్ట్రలోని ఔరంగాబాద్ వద్ద గల బనోటీ గ్రామ సమీపంలో వకటక కాలంనాటి రాతిలో చెక్కిన మూడు గుహలు కనుగొనబడ్డాయి స్థానికంగా "ఋషిచి ఘర్" (ఋషుల నివాసాలు) అని పిలువబడుతున్న ఈ గుహలను దర్కుండ్ జలపాతం సమీపంలో గల దట్టమైన అడవిలోని ఒక నల్లరాతిని చెక్కి నిర్మించారు ఈ గుహలను చేరేందుకు ఒక వ్యక్తి 600 అడుగుల ఎత్తుకల ఒక కొండ శిఖరానికి ఆరోహణ చెయ్యాలి ఈ గుహల్లోని స్తంబాలపై చెక్కిన అలంకృత చిత్రాలు, శిల్పాలు మరియు వాస్తుశాస్త్రం ప్రపంచ ప్రసిద్ధ పొందిన అజంతా గుహలలోని కొన్నిటిని ప్రతిబింబిస్తాయి

## పైకప్పుతో మూసిన మసీదు

గుల్బర్గా (కర్ణాటక) కోటలోని బ్రహ్మాండమైన జమ్మీ మసీదు - పైకప్పుతో పూర్తిగా మూయబడిన ఇండియాలోని ఒకే ఒక పెద్ద మసీదు ఒకటవ మహమ్మద్ షా బామనీ పరిపాలనా కాలంలో - 1367లో దీన్ని నిర్మించారు

## అమెరికా ఖండాల పెరుగుదల

అమెరికాకు చెందిన ఖండాలు ప్రతి సంవత్సరం 3 క్యూబిక్ కిలో మీటర్లకు పైగా పెరుగుతున్నాయని యుఎస్ జియొలాజికల్ సర్వేకి చెందిన ఇద్దరు భూవిజ్ఞాన శాస్త్రవేత్తలు కనుగొన్నారు అమెరికన్ ఖండాలు సముద్ర గర్భం నుంచి గడించుకున్న వస్తువులలో - సముద్ర గర్భంలోని అగ్ని పర్వతాల నుంచి వెలువడే లావా, సముద్ర సంబంధమైన వ్యవస్థ నిల్వ చేసిన ఖనిజాలు మరియు ఖండాలనుంచి విస్ఫోటనం చెంది అడుగున తేరిన అదనపు మట్టి (సముద్రంలోకి కొట్టుకుపోయిన మట్టి) లభిస్తుంది

## బల్గేరియన్ బాషలో బగవద్గీత

బల్గేరియన్ బాషలో బగవద్గీత ప్రచురింప బడింది బల్గేరియన్ బాషతో గణనీయమైన అనుబంధంగల సంస్కృతం నుండి నేరుగా ఇది అనువాదం చేయబడింది అరవిందుడు, లోకమాన్య తిలక్ మరియు మహాత్మాగాందీలు చేసిన భగవద్గీతా వ్యాఖ్యానాలను కూడా ఈ అనువాదంలో చేర్చారు

## సుదీర్ఘమైన నడక

యుఎస్ఏకి చెందిన ఆశ్రితా ఫర్మన్ తన తలపై ఒక పాల సీసా పెట్టుకుని 1992 మే 23వ తేదీన అత్యధిక దూరం - 98 2 కి మీ లు నడిచాడు ఈ సుదీర్ఘ నడక పూర్తి కావటానికి అతనికి 15 గంటల 2 నిమిషాలు పటింది

## ఆనాటి వార్తలు

### చైనాలో మొదటి లింగమార్పిడి శస్త్ర చికిత్స

*1983 లో చైనాలో మొదటి లింగమార్పిడి శస్త్ర చికిత్స జరిగింది ఒక ప్రముఖ సైనికాధికారి యొక్క 20 సంవత్సరాల కుమారుణ్ణి స్త్రీగా మార్చటం జరిగింది*

"దేవుడు, స్వర్గం, సత్యం, పాపం వంటి విషయాలపైన వందేళ్ళు ధర్మోపన్యాసాలు ఇచ్చేవానికంటే ఒక అన్నార్తునికి అన్నం పెట్టినవాడే యోగ్యుడు "

— బుద్ధుడు

టి ఎం విశ్వనాథన్

ఒక పురాతన శివాలయం - త్రిచూర్‌లోని శ్రీవడక్కునాదన్ ఆలయం ఇది కేరళలోని అతి పెద్ద దేవాలయాల్లో ఒకటి ఈ దేవాలయం 1500 సంవత్సరాల నాటిదని ప్రతీతి పట్టణానికి అభిముఖంగా ఉండే ఒక గుట్టపైన ఇది నిర్మితమైంది దీని లోపలి ఆవరణ ఒక ఎకరం వైశాల్యం కలిగి ఉంటుంది బ్రహ్మాండమైన నాలుగు గోపురాల మధ్యగల వైశాల్యం 8 ఎకరాలు ఉంటుంది




ప్రదాన అర్చనా మూర్తులను ప్రతిష్టించిన - శ్రీ కోవెలలు - గర్భాలయాలు నలంబలం అని పిలువబడే ఒక చతుర్భుజ భవనంలో ఉంటాయి విస్తృతంగా సమతలం చేసిన స్థలం మధ్యలో ఈ దేవాలయ భవనం నిర్మితమైంది ఇక్కడ పశ్చిమ ముఖంగా పరమ శివుణ్ణి ప్రతిష్టించారు పార్వతీదేవి తూర్పు ముఖంగా ఉంటుంది అమ్మవారు శ్రీవడక్కునాథన్‌కు వెనుక వైపుగా ఉంటుంది ఈ దేవాలయంలోని ఇతర దేవతామూర్తులు - శ్రీరామచంద్రుడు, శ్రీశంకర నారాయణుడు, మరియు శ్రీ మహాగణపతి ఇక్కడ వెట్టకొరుమాకన్ యొక్క చిన్న విగ్రహం కూడా ఉన్నది

ఇక్కడ ఉన్న ముఖమండపాలలోని స్తంభాలు, ఫలకాలు మరియు పై కప్పులు ఊహాత్మక నైపుణ్యం కల కొయ్యపనివారి శిల్పచాతుర్యానికి మచ్చు తునకలుగా నిలుస్తాయి పురాణాలు, ఇతిహాసాల నుండి తీసుకున్న అంశాలను వీరు కొయ్యలపై చెక్కి ప్రదర్శించారు

మూడు గర్భగుళ్ళ వెలుపలి గోడలపై రామాయణ, మహాభారతాల సుందరవర్ణ లేపన చిత్రాలు కనిపిస్తాయి

వడక్కునాథన్ స్వామికి సమర్పించే ప్రధాన నైవేద్యం - నేతి నివేదన (నెయ్యట్టం) ఆరుద్ర దర్శనం రోజున అత్యధిక పరిమాణంలో - నేతిని స్వామికి నివేదన చేస్తారు

ఈ దేవాలయంలో జరిగే వార్షిక ప్రధాన ఉత్సవం ఫిబ్రవరి - మార్చి మాసాల్లో శివరాత్రి నాడు జరుగుతుంది అప్పుడు 1,00,000 (నూనె) ప్రమిదలను వెలిగిస్తారు దేవాలయం యావత్తూ నూనె దీపాల కాంతులతో ప్రకాశిస్తుంది

ఏప్రిల్ - మే మాసాలలో ప్రసిద్ధి చెందిన పూరమ్ ఉత్సవం - దేవాలయపు విశాల మైదానంలో జరుగుతుంది అలంకృతమైన ఏనుగులు, అద్భుతమైన ఊరేగింపులు, బాణసంచా కాల్పులు - ఈ ఉత్సవ చిహ్నాలుగా ఉంటాయి

## ఇండియాలో పట్టణ జనాభా

*ప్రస్తుతం ఇండియా లోని పట్టణ జనాభా ప్రపంచంలోని పట్టణ జనాభాలో నాల్గవది 2000 సంవత్సరం నాటికి ఇదే అత్యధిక జనాభా కల తయారవుతుంది*

'ఇతరులతో కలిసి జీవించటం - ముందుకు వెళ్ళేందుకు ఆశ విజయం సహకారంతో ముడివేయబడింది."

అంగ క్రమనిర్మాణానికి కావలసిన దాదాపు అన్ని విటమిన్లు, ఇనుము (అంశాల) వంటి ద్రవ్యాలు,మెగ్నీషియం, ఫాస్ఫరస్ - ఇవన్నీ టీ (తేనీరు)లో ఉన్నాయి తాజాగా తయారు చేసిన తేనీరు రుచిగా, ఉపయోగకరంగా ఉంటుంది



టీని ప్రత్యేకమైన చైనా లేదా పోర్సిలిన్ గాజుకూజాలలో బిరడా బిగించి ఉంచటం ఉత్తమం దీన్ని బహిరంగంగా ఉంచినట్లయితే సువాసన కోల్పోతుంది రుచినీ, రోగనాశక పదార్థాలనూ కోల్పోతుంది

టీని తయారు చేస్తున్నప్పుడు చాలా సేపటి నుంచి కాగుతున్న నీటిని ఉపయోగించవద్దు అప్పుడు అది సువాసనగా ఉండదు టీ తయారు చేసేందుకు మృదువైన నీరు (soft ater) ఉత్తమంగా ఉంటుంది టీ కోసం కాగ ౕ వేడినీటిలో పరిశుద్ధమైన సున్నపు లవణాలను బంధించే చక్కెర తునకల్ని యండి

టీ ప్రధానంగా నాణ్యతపై ఆధారపడుతుంది అది ఎక్కడ తయారైనది, చైనా లేదా పోర్సిలిన్ కూజాలు ఎంత బాగా ఉన్నాయి - అనే విషయాలపై ఈ నాణ్యత ఆధారపడుతుంది ముందుగా పాత్రను వెచ్చబరచాలి ఆ తరువాత కావలసిన మేరకు టీని, వేడి నీటిని పొయ్యాలి

మూడు కప్పుల కోసం నాలుగుపూర్తి చెంచాల టీ పొడి అవసరమౌతుంది టీని సిద్ధం చేసిన వెంటనే టీ పాత్ర మూతకు ఉన్న రంధ్రాలను, జారీ చెంబువంటి ఆ పాత్ర యొక్క కొమ్ము (ముక్కు) నూ, సువాసన కోల్పోకుండా నాప్‌కిన్‌తో మూసివేయాలి తాజాగా ఉన్నప్పుడే టీ బాగుంటుంది నిస్సారమైన (పాత) టీని త్రాగకూడదు

రోజుకు మూడు లేదా నాలుగు కప్పుల టీ - ఆవశ్యకమైన విటమిన్ 'పి'ని సమకూరుస్తుంది సాధారణంగా (చిక్కగా) ఉండే టీలో సగం స్ట్రాంగ్ టీనే పిల్లలు తీసుకోవాలి

తేనె మరియు వేడిపాలతో చేసిన (ఒక టేబిల్‌స్పూన్ నిండుగా తేనె మరియు, మూడు టేబిల్‌స్పూన్ల పాలు చేర్చిన ఒక కప్పు టీ) తాజా అయినది, శక్తి కలది, ప్రేరేపించే టీ-జలుబుకు అద్భుతమైన చికిత్స టీతో నోటిని పుక్కిలించినట్లయితే అది గొంతు నొప్పిని పారద్రోలుతుంది

## 1,850 భాషల్లోకి బైబిల్ అనువాదం

*ముద్రణ కనుగొన్న తరువాత బైబిల్ దాదాపు 1,850 భాషల్లోకి అనువదించబడింది*



## క్విజ్

1 సువా (suva) ఏ దేశపు రాజధాని?
(ఎ)పాపువా న్యూగినియా, (బి)మాల్దీవులు, (సి) లావోస్, (డి) ఫిజీ



2 మోనికా సెలెస్ ఎవరు?
(ఎ) టెన్నిస్ క్రీడాకారిణి, (బి) చెస్ ఆట కత్తె, (సి) నటీమణి, (డి) బాడ్మింటన్ క్రీడాకారిణి

3 ఇండియాలో ప్రప్రథమంగా స్వదేశీ ఉత్పా దనగా నిర్మితమైన క్షిపణినావ ఏది?
(ఎ) చక్ర, (బి) అగ్ని, (సి) చిత్ర, (డి) విభూతి

4 టియానన్మిన్ స్క్వేర్ ఉన్న దేశం
(ఎ) జపాన్, (బి) కొరియా, (సి) చైనా, (డి) ఇండోనీషియా

5 సముద్రాల చేత ఆవరించబడిన భూ వైశాల్యం శాతమెంత?
(ఎ)70,(బి) 60, (సి) 50, (డి)80

6 ప్రపంచంలో ప్రాచీనమైన ప్రజాస్వామ్య విదానం కలదేశం
(ఎ)బ్రిటన్, (బి)యునైటెడ్ స్టేట్స్, (సి) పోర్చుగల్, (డి)ప్రాన్స్

7 ఆఫ్రికాలోని కిలిమంజారో ఏమిటి?
(ఎ) నది, (బి) అగ్నిపర్వతం, (సి) పర్వత శిఖరం, (డి) పురాతన ఆదివాసితెగ

8 ఇంద్ర ధనుస్సులో ఈక్రింది రంగులు

(ఎ) ఊదారంగు, (బి) నీలవర్ణం, (సి) నారింజ రంగు, (డి)గోదుమవర్ణం, (ఇ) పసుపురంగు

*"నీవు ఆత్మవిశ్వాసం పెంపొందించుకునేందుకు "చేయలేను, లేదు" వంటి వ్యతిరేక పదాలను వాడవద్దు" అని ఆ యువతికి న్యాయవాది సలహా ఇచ్చాడు*

*"అలా చేయగలనని భావిస్తున్నావా?" అని ప్రశ్నించాడు*

*"అవునండీ' ఎందుకు చేయలేన్నదేది నేను ఆలోచించలేక పోతున్నాను' అని యువతి జవాబిచ్చింది.*

## ఇండియాలో విస్తృత తపాలా సౌకర్యం

*ఇండియాలో తపాలా సౌకర్యం విస్తృతంగా ఉంది మొత్తం 147,000 పోస్టాఫీసులు ఉన్నాయి తొలిరోజుల్లో దేశం మొత్తం మీద 701 తపాలా కార్యాలయాలు మాత్రమే ఉండేవి ఈ పెరుగుదల 200 రెట్లు కంటే ఎక్కువగా ఉంది*

## కాలీప్లవర్ లేక కాబేజీ వంట

కాలీప్లవర్ను వండేటప్పుడు ఒక కప్పు పాలను చేర్చండి సువాసనతోపాటు తెలుపుదనం కూడా వస్తుంది కాబేజీ వండేటప్పుడు ఒక నిమ్మబద్దను నీటిలో వేర్పండి అది వాసన పోగొట్టుతుంది

— హెరాల్డ్ ఆఫ్ హెల్త్ సౌజన్యంతో

'పలితాలం నా తలపైన ఉంది కానీ శాశ్వతమైన వసంతం నా హృదయంలో ఉంది"
— విక్టర్ హ్యూగో

## మాటల మహిమ

1 శ్రుతి (ఎ) వేదము, (బి) చెవి, (సి) వినికి, (డి) సుద్ది
2 శ్వేత (ఎ)తెలుపు, (బి) గవ్వ, (సి)కైలాస పర్వతము, (డి) సీసము
3 సభ (ఎ)కొలువు కూటము, (బి)మృగము, (సి) సమూహము, (డి) జూదము
4 సైకతము (ఎ) ఇసుక దిబ్బ, (బి) ఇసుక నేల, (సి) సైన్యము, (డి) స్వర్గము
5 స్వాగతము (ఎ) కుశల ప్రశ్నము, (బి) సుఖముతోడి రాక, (సి)స్వేచ్ఛ, (డి)వృత్త విశేషము
6 హేతి (ఎ) అగ్నిశిఖ, (బి) మంట, (సి) సూర్యకిరణము, (డి) ఆయుధము
7 హృది (ఎ)మనస్సు, (బి) గుండెకాయ, (సి) ఔమ్ము,(డి) వీణ
8 హెూర (ఎ)అహెూరాత్రము, (బి), రాశ్యర్ధము/లగ్నభేదము, (సి) శాస్త్రవిశేషము, (డి) రేఖా భేదము

## తెలివికి పరీక్ష

1 మానవుల లాలాజలంలో ఉన్న ఎంజైమ్ పేరేమిటి?
2 సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలను ఏమని పిలుస్తారు?
3 ఈసారి సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన వారెవరు?
4 పాకిస్తాన్ కొత్త ప్రధానమంత్రి ఎవరు? ఏ పార్టీకి చెందినవారు?
5 "ప్రస్థాన త్రయం" అంటే ఏమిటి?
6 ఈ సంవత్సరం శత జయంతి ఉత్సవాలు జరుపుకుంటున్న ప్రముఖ ఆంధ్ర వాద్య కారుడెవరు?

(జవాబులకు వపేజీ చూడండి)




జూల్స్ వెర్న్ - ప్రసిద్ధి చెందిన రచయిత మరియు నవలల్లో సైన్స్ కల్పిత కథల ప్రతిపాదకుడు 1865లో ప్రచురింపబడిన అతని పుస్తకం 'రౌండ్ ది మూన్'- సైన్స్ అద్భుతాల గురించి వ్రాసిన ఒక ఆసక్తికర రచన భవిష్యత్తులో ఎదో ఒక రోజున చంద్రునిపైకి ముగ్గురు వ్యక్తుల విమాన యానం గురించి అతడు ముందుగానే సూచించాడు ఈ పుస్తకంలో వెర్న్ వర్ణించిన వ్యోమశకటం 19,250 lbs బరువు ఉంటుంది అమెరికా ప్రయోగించిన అపోలో వ్యోమశకటం దాదాపు 12250 lbs ఉన్నది

## క్రికెట్ వార్తలు

వరుస

1928 - 29 సీరీస్‌లో ఇంగ్లండ్‌కు చెందిన వాలీ హమ్మండ్ వరుసగా డబల్ హండ్రెడ్స్‌తో రెండు సెట్స్ స్కోర్ చేశాడు - (సిడ్నీలో 251 మరియు మెల్‌బోర్న్‌లో 200) 1932-33 లో (క్రైస్ట్ చర్చ్‌లో 227 మరియు ఆక్లండ్ (న్యూజిలాండ్) లో 336 (నాట్ అవుట్)

"అది ఎంత కష్టమైన కార్యమైనా, నీకు ఉత్తమంగా తెలిసిన పనినే ఎప్పుడూ చేయి" — ది మదర్

## ముందు గొంతు కొయ్యి!

ఒక రోజు సూర్యోదయానికి ముందే ఒక కానిస్టేబుల్ పట్టణంలో తిరుగుతున్నాడు మైదానం దగ్గర ఉన్న ఒక ఒంటరి ఇంటి సమీపంలోకి వచ్చేసరికి లోపల నుంచి ఎవరో కేకలు వేస్తున్నారు "ముందు గొంతు కొయ్యి



చేతుల విషయం తర్వాత చూద్దాం" అనే అరుపులు వినవచ్చాయి ఏదో పెద్ద ఘోరమే జరిగిపోతున్నదని కానిస్టేబుల్ భావించి స్టేషన్ అధికారికి చెప్పేందుకు దగ్గరలో ఉన్న పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు కొంచెం సేపట్లోనే పోలీస్ దళం ఆ స్థలానికి చేరుకుంది వాళ్ళు తలుపు తట్టి, లోపల వారిని బయటికి రమ్మన్నారు తలుపులు తెరుచుకోగానే ఒక దర్జీ తన కొలతల బల్ల ముందు చేతిలో కత్తెరతో నిల్చుని కన్పించాడు తలుపు తెరచిన అతని సహాయకుడు వచ్చిన వారిని చూసి గుడ్లుమిటకరించాడు

-టి ఆర్ కృష్ణకుమార్

## ఉత్తరాలు తెరచి చూడరు

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో ఒక జపానీయుడు తన మిత్రునికి ఇలా వ్రాశాడు "ఈ ఉతరం నీకు అందుతుందో లేదో నాకు తెలియదు ఎందుకంటె సెన్సార్ వాళ్ళు దీన్ని తెరచి చూడవచ్చు" ఒక వారం తరువాత పోస్టాఫీస్ నుండి అతనికి ఒక పత్రం అందింది "మీ ఉత్తరంలోని ప్రకటన తప్పు మేము ఉత్తరాలను తెరచి చూడము" అని దానిలో ఉంది!

## వంటవారికి జీతాలు అధికంగా ఇచ్చేచోటు

*అధికంగా డబ్బు చెల్లించబడే వంటవాళ్ళు కోపెన్‌హాగన్‌లో ఉన్నారు ఒక మంచి ఫలహారశాలలో కానీ, ఒక హోటల్‌లో కానీ వారానికి 39 గంటల పనికి వారికి సరాసరి 43,400 డాలర్లు సంవత్సర వేతనంగా లభిస్తుంది*

## భారత తపాలాశాఖ మోస్తున్న భారం



*100 ఏళ్ళ క్రితం ఇండియన్ పోస్టాఫీస్‌లు 13 మిలియన్ వస్తువుల్ని రవాణా చేసేవి ప్రస్తుతం 14 బిలియన్ వస్తువుల్ని రవాణా చేస్తున్నాయి ఇది అనంఖ్య కంటే 1000 రెట్లు ఎక్కువ గత కొన్ని దశాబ్దాలలో తపాలా వస్తువుల పెరుగుదల 4 నుంచి 5 శాతం రేటున ఉన్నది*

"విధి (ప్రారబ్ధం) కి వ్యతిరేకమైన కవచం ఏదీ లేదు"

— జోన్సు సిరే

ఒక రాజకీయ నాయకుడు గత ఎన్నికల్లో నేను చేసిన వాగ్దానాలను మర్చిపోయానని నేను అంగీకరిస్తున్నాను మీలో ఎవరైనా అవి ఏమిటో నాకు చెప్పగలరా? ఎందుకంటే మళ్ళీ నేను వాటిని వాగ్దానం చేసాను ''

## ముఖ్యమైనది భద్రపర్చాను

ఒకసారి మహాత్మాగాంధీ నౌకా ప్రయాణం చేస్తున్నారు ఒక ఆంగ్లేయుడు గాంధీజీపై ఒక సుదీర్ఘమైన, అత్యంత విమర్శనాత్మకమైన కవిత వ్రాసి సమర్పించాడు గాంధీజీ ఆ కాగితాలకు పెట్టిన గుండుసూదిని తీసి ఒక పెట్టెలో భద్రం చేశారు

అప్పుడు ఆ ఆంగ్లేయుడు గాంధీజీతో అన్నాడు ''చదవండి, గాంధీ! అది చాలా ముఖ్యమైనది ''

గాంధీజీ చమత్కారంగా చెప్పారు, ''మిత్రమా! ఏది ముఖ్యమో, దాన్ని ఇప్పటికే నా పెట్టెలో భద్రం చేశాను ''

## తువ్వాళ్ళ కోసం

ఆస్థూలకాయుడైన అతిథి వెళ్ళబోతుండగా మేనేజర్ ప్రార్థించాడు ''మీరు వెళ్ళే ముందు మనసు మార్చుకుని, ఒక్క వ్యాయామం చేయండి ముందుకు వంగి, మోకాళ్ళను వంచకుండా - మీ సూట్‌కేసను తాకండి ''

ఆ వ్యక్తి వంగి ఇలా చెప్పాడు ''మంచిది! నేను నాసూట్‌కేస్ తాకాను, తరువాత ఏమి చెయ్యాలి?''

''దాన్ని తెరవండి, మా తువ్వాళ్ళను మాకు తిరిగి ఇవ్వండి'' అన్నాడు మేనేజర్

—ఎస్ కె శ్రీవాత్సవ

రామ్ కుమార్



Victory Tower, Chittor, Rajasthan

రాజస్థాన్‌లోని బ్రహ్మాండమైన చిత్తూరు కోట 500 అడుగుల ఎత్తునున్న ఒక కొండపై నిల్చి ఉంటుంది తమ చుట్టూ అల్లబడిన చారిత్రక సంఘటనలతో కూడిన భవనాలు, దేవాలయాలు మరియు గోపురాలు ఇక్కడ ఉన్నాయి అత్యంత విశిష్టమైన కీర్తి స్తంభం - ''జయస్తంభం'' - భారతీయ వాస్తు శాస్త్రానికి అద్వితీయమైన నమూనా ఈ గోపురం దాదాపు 120 అడుగుల ఎత్తు కలిగి ఉంటుంది ఆధారం (పునాది)లో దాదాపు 30 అడుగుల వ్యాసంతో ఉంటుంది శిఖరాగ్రంలో - గుమ్మటం క్రింద 17½ అడుగుల ఎత్తు ఉంటుంది దీనిలోని 157 మెట్లు చుట్టూ ఒక గాలరీని నిర్మించారు ప్రతి అంతస్తులోని ప్రతి ప్రాంగణంలోకి తెరవబడే విధంగా తొమ్మిది అంతస్తులు వెలుపలి ద్వారాలతో ఉంటాయి గోపురం పైనుంచి పరిసర ప్రాంతాల విహంగ విశాల దృశ్యాన్ని వీక్షించవచ్చు మాళ్వా గుజరాత్ రాజులపై తన విజయాన్ని కొనియాడే స్మృతి చిహ్నంగా మేవార్‌కు చెందిన కుంభరాణా ఈ ప్రసిద్ధ గోపురాన్ని నిర్మించాడు

— 'ఇండియన్ అండ్ ఫారిన్ రివ్యూ' సౌజన్యంతో

'చాలినంత సన్నాహం పైనే విజయం ఆధారపడి ఉంటుంది, అది లేనట్లయితే అపజయం తథ్యం ''

## కె పి ఎస్ మీనన్

ప్రస్తుత జీవితానికీ, నా చిన్నతనం నాటి జీవితానికీ ఎంతో తేడా ఉంది అప్పుడు మోటారు కార్లు కానీ, బస్సులు కానీ, లారీలు కానీ లేవు నేను పుట్టి పెరిగిన కొట్టాయం (కేరళ)లోకి మొదటి కారు 1910లో వచ్చింది అది ఒక ఆంగ్లేయునికి చెందింది అతని పేరు కూడా వింత గొల్పేటట్లు - 'కార్' (carr)



K P S Menon

ఆ రోజుల్లో ఎడ్లబళ్ళను సాధారణంగా రాక పోకలకు ఉపయోగించేవారు నేను కూడా పాఠశాలకు ఎడ్ల బండిలోనే వెళ్ళేవాణ్ణి మొట్ట మొదటిసారిగా కొట్టాయం దాటి నేను బయటికి వెళ్ళింది కూడా ఎడ్లబండిలోనే అప్పుడు నా సోదరుడు న్యాయవాద వృత్తి నిర్వహిస్తున్న చోటు - 20 మైళ్ళ దూరంలోని పాలైకు వెళ్ళాను ఆలస్యంగానే రాత్రి భోజనం ముగించుకుని మా నాన్న, అమ్మ, సోదరులు, వదినెలు - అందరం ఒక ఎడ్లబండి ఎక్కాము గడ్డి మీద పరచిన ఒక చాపపైన నిద్రించాము మేము పాలై చేరేసరికి సూర్యోదయం అయింది 1911లో రాత్రంతా జరిగిన ఈ ప్రయాణం ఇప్పుడు ఒక గంటలోపే పూర్తవుతుంది

నా బాల్యదశలో నేను చేసిన సాహస కార్యం - త్రివేంద్రంకు నా యాత్ర శ్రీమూలం ప్రజాసభ అని పిలువబడే శాసన సభా సమావేశాలలో కొట్టాయం ప్రతినిధిగా మా నాన్న త్రివేంద్రం వెళ్ళవలసి ఉంది దృఢమైన పడవ వారు తెడ్లతో నడిపే ఒక మోటు పడవలో మా ప్రయాణం సాగింది ఈ యాత్ర పూర్తయేందుకు మాకు మూడు రోజులు పట్టింది, ఇప్పుడు కారులో మూడుగంటల్లో చేరవచ్చు

ప్రథమ ప్రపంచ యుద్ధ సమయంలోనే ఇంగ్లండ్‌కు నా మొదటి ప్రయాణం జరిగింది ఆఫ్రికాలోని గుడ్‌హోప్ అగ్రాన్ని చుట్టిన ఈ ప్రయాణం 65 రోజులు పట్టింది 1952లో

## 3000 మైళ్ళు ప్రయాణం చేసిన శునకం

*1979లో ఒరెగాన్‌కు చెందిన ఒక అమెరికన్ - బంధువులతో సెలవులు గడుపుతున్నాడు తనతో పాటు తన అభిమాన శునకం - బాబీని కూడా తెచ్చుకున్నాడు ఒకరోజు అతని కారు ఆ పట్టణంలోని ఒక గారేజీలో మరమ్మతు పనిలో మునిగి ఉన్నప్పుడు బాబీ మరో కుక్కతో పోట్లాటకు దిగింది అది తిరిగి వచ్చేలోగా యజమాని ఇంటికి చేరుకున్నాడు దిగులు చెందని కుక్క ఒరెగాన్‌కు 3 000 మైళ్ళు ప్రయాణం చేసింది నదులు ఎడారులు, కొండలు దాటింది ఆరునెలల తరువాత అంతరాత్మ మార్గ దర్శకత్వంలో ఇంటికి చేరుకుంది ఇంటికి చేరేటప్పటికి అది అస్థిపంజరంగా - సన్నగా మారిపోయింది*

"సత్ప్రవర్తన ద్వారా లభించే సంతోషమే నిజమైన సుఖాన్ని కలిగిస్తుంది ఇతర సుఖాలన్నీ బాధ పెట్టేందుకు ఆధారాలే, అవమానపర్చేందుకు కారణాలే అవుతాయి."

## ప్రొఫెసర్ కె వి ముత్తయ్యా ఎమ్ ఏ

స్వార్థపరత్వం దృడమైన మూలాదారం కాగా, దానికి విశేష లక్షణంగా ఉండేది క్రోదం - కోపవివశుడైన మనిషి తననూ, తన కుటుంబాన్నీ మరియు తన మిత్రులనూ నాశనం చేస్తాడు రాశవల్ల వ్యక్తిగతమైన క్రోదం ఉద్భవిస్తుంది



Tiruvalluvar

స్వార్థపరత్వం నుంచి సామాన్య మానవుడు వైదొలగటం పూర్తిగా సాధ్యం కాకపోయినా, విరోధం, విముఖత, దూషణ వంటి చెడు లక్షణాల - నుండి తప్పించుకోవచ్చు. అత్యంత ఆదరణీయ గ్రంథం"తిరుక్కురళ్" రచయిత తిరువళ్ళువర్ (200 ఏ డి ) కోపం వల్ల వచ్చే అరిష్టాలు, దీనినుండి తప్పించుకోవటం వల్ల వచ్చే సద్గుణాలను గురించి చెప్పటం జరిగింది

నిగ్రహాన్ని కోల్పోయినప్పుడు - అది చెడు సంభాషణలకు, కఠినమైన మాటలకు దారి తీస్తుంది దీని ఫలితంగా శారీరక బలం ప్రయోగించవలసిరావటం జరుగుతుంది దీని పరిణామాలు ఊహించలేనివి, భరించ రానివి

ప్రదానంగా "తిరుక్కురళ్"లోని "కోపాన్ని నిగ్రహించుకోవటం" అనే అంశం వ్యక్తి కోసమే ఉద్దేశించబడింది ఇది రాజకీయ నాయకుల కోసం ఉద్దేశించింది కాదు ఎందుకంటే వారు కొన్ని సమయాల్లో విదేశీశక్తుల నుంచి మరియు అంతర్గత శత్రువుల నుంచి రెచ్చగొట్టే ఉద్వేగాలను ఎదుర్కొనవలసి వస్తుంది

కొన్ని సమయాల్లో క్రోదం - న్యాయ వివేచన, న్యాయబద్ధత మరియు సచ్ఛీలత (చిత్తశుద్ధి) వంటి అంశాలపై కూడా - వస్తుంది దీనికి సాంఘిక న్యాయంలో చికిత్స కనుగొనవలసి ఉంటుంది

వ్యక్తులకు సంబంధించినంతవరకు, కోపం వల్లనే అనేక అరిష్టాలు ప్రాప్తిస్తాయి హత్య, శిశుహత్య, దహనం, వివాహ విచ్ఛిత్తి, అణచలేని నేరాలు, ఆస్తి విధ్వంసం (ప్రజల ఆస్తి మరియు ప్రభుత్వ ఆస్తి), సంఘం విభజించబడి శిథిలమైపోవటం, అవ్యవస్థ మొదలైన వాటికి క్రోదమే కారణం

## త్రీ డీ డ్రాయింగ్స్‌తో తపాలాబిళ్ళలు

త్రీ డైమన్షనల్ డ్రాయింగ్స్‌తో కూడిన కొత్తరకం తపాలా బిళ్ళలు నేడు యునైటెడ్ స్టేట్స్‌లో వ్యాప్తి చెందాయి ఏ కోణం నుంచి నీవు వాటిని చూస్తావో దాన్ని బట్టి వాటి రంగులు మారుతాయి

— 'మిషా' సౌజన్యంతో

"విమర్శాపాత్రమైన విషయంలోని బలహీనతలో మాత్రమే విమర్శన యొక్క పటుత్వం నిల్చి ఉంది."

వళ్ళువర్ ఇలా చెప్పారు "బలహీనులపై నీ కోపాన్ని అదుపు చేసుకున్నప్పుడే నీవు మానవుడవు అవుతావు అప్పుడు నిన్ను నీవు జయించుకుంటావు " నిజానికి ఇది దుస్సాధ్యమైన కార్యమే, కానీ ప్రతిపలం పలవంతంగా ఉంటుంది ఇది ఒక ఉదాత్త లక్షణం "దృఢమైన హస్తాలకు వ్యతిరేకంగా నా కోపాన్ని నేను ప్రదర్శించను" అని నీవు చెప్పినట్లయితే, అది స్వస్థ చిత్తత అవుతుంది శక్తివంతులూ, దృఢకాయులూ అయిన వ్యక్తులను ఆక్షేపించే మూర్ఖపు పని నీవు చేసినట్లయితే, వారి క్రోధంవల్ల ఉత్పన్నమయ్యే తీవ్ర పరిణామాలను నీవు ఎదుర్కొనవలసి వస్తుంది

క్రోధాన్ని వ్యక్తపరచటమనేది - రక్షణలేని జీవులపై శారీరక బలాన్ని ప్రయోగించటానికి కూడా దారితీస్తుంది నోరులేని మూగజీవులైన జంతువులు, పక్షులు మొదలైన వాటిపై హింసాత్మకమైన క్రోధం ప్రదర్శించటం కూడా పిరికితనం,క్రూరత్వం అనిపించుకుంటుంది కారణం దెబ్బ తిన్నప్పుడు ఇవి తిరిగి ఎదురు దెబ్బ తీయలేవు గనుక కోపంతో ఒకసారి చేసిన గాయం ఎన్నటికీ మానదు

నీకన్నా బలవంతులపై ప్రదర్శించిన కోపం నీకు ఎలా హాని కలిగిస్తుందో బలహీనులపై ప్రదర్శించిన కోపం కూడా అలాగే హాని కలిగిస్తుంది ఒక రక్షణలేని వ్యక్తిని నీవు గాయపరిస్తే - అది ఇప్పుడు నీకు తెలియకపోయినా - కొంతకాలం గడచిన తరువాత నీవు ఆ బాధ అనుభవిస్తావు తప్పుకు తగిన శిక్ష పడుతుందనే న్యాయశాసనం తప్పక నీకు తగిలి తీరుతుంది దానినుంచి నీవు తప్పించుకోలేవు కనుక బలహీనుల పట్ల నీక్రోధాన్ని అదుపు చేసుకోవటం వివేకవంతం, సురక్షితం కూడా

ఆంద్రీ ఇవఖ్‌నోవ్

*భూమికి ఏకైక ఉపగ్రహం చంద్రుడు కాగా, అంగారకగ్రహాని (Mars)కి రెండు స్వాభావికమైన ఉపగ్రహాలు ఉన్నాయి - ఫోబోస్ మరియు డైమోస్ ఈ పేర్లు గ్రీకువి "భయం" మరియు "భీతి" అని వీటి అర్థం మామూలు దృష్టితో(నగ్ననేత్రంతో) చూసేందుకు ఈ రెండు ఉపగ్రహాలు చాలా దుర్బలంగా ఉంటాయి ఇవి అంతరిక్ష పరిశోధకులు ఇంకా పరిష్కరించని అనేక నిగూఢమైన అద్భుతాలు కలిగి ఉన్నాయి*



*దూరం నుంచి పోబోస్ దాదాపు చందమామ వలెనే కనిపిస్తుంది బహుశా స్వల్పంగా గుండ్రం తక్కువగా ఉంటుంది కానీ అగ్ని (పర్వత) బిలాలతో ఆవరింపబడి ఉంటుంది*

*ప్రోబ్స్ అని పిలువబడుతున్న మానవరహిత వ్యోమ శకటాలు మాత్రమే అంగారక గ్రహానికి చేరుకున్నాయి వీటిల్లో ఒకటి - పోబోస్ పైనున్న గాడులు (పల్లాలు) వంటి చిత్రమైన కాలువల ఛాయాచిత్రాలు తీయటం జరిగింది*

— మిషా' సౌజన్య

"[illegible] పరిశ్రమలో తిరిగి పొందవచ్చు, పోగొట్టుకున్న జ్ఞానాన్ని అధ్యయనం ద్వారా గడించవచ్చు, కోల్పోయిన ఆరోగ్యాన్ని ఆత్మనిగ్రహం ద్వారా, వైద్యం ద్వారా పొందవచ్చు కానీ గడచిన కాలం - ఎప్పటికీ కోల్పోయినట్లే" — [illegible] స్మైల్

ఉత్తర ప్రదేశ్‌లోని వారణాసికి సమీపంలో ఉన్న సారనాథ్- గౌతమ బుద్ధుని మతమైన బౌద్ధమతానికి జన్మస్థలంగా గుర్తించబడింది ఇక్కడి జింకల ఉద్యానవనంలో ఆయన తన మొదటి ప్రసంగాన్ని చేశారు



Sarnath Stupa

మౌర్య వంశానికి చెందిన అశోక చక్రవర్తి బౌద్ధభిక్షువులకు, సన్యాసినులకు సంబంధించిన ఒక ఆదేశాన్ని ఒక స్తంభంపై చెక్కించి ఇక్కడ నెలకొల్పాడు చైనా యాత్రికులైన ఫాహియాన్ మరియు హూయాన్ త్సాంగ్ 5వ మరియు 7వ శతాబ్ది A D లలో సారనాథ్ సందర్శించి ఆ స్థలానికి సంబంధించిన అమూల్యమైన సమాచారాన్ని మనకు అందించారు 12వ శతాబ్ది ఏ డి తొలిభాగంలో ధర్మచక్ర ఆలయాన్ని - కనౌజ్ రాజు గోవింద చంద్రుని అర్ధాంగి అయిన మహారాణి కుమారదేవి స్థాపించింది కాని త్వరితగతిలో, ఆఫ్ఘనిస్తాన్ నుంచి వచ్చిన మహమ్మద్ ఘోరీ సైన్యాలు ఈ స్థలాన్ని ధ్వంసం చేశాయి

ఆధునిక కాలంలో భూగర్భ శాస్త్రజ్ఞులు సారనాథ్ శిథిలాల త్రవ్వకం జరిపారు ఒక వేదికపై నిర్మించిన స్థూపం యొక్క శిథిలాలను ప్రతిబింబిస్తున్న ఒక ఎత్తైన ఇటుక రాతి దిబ్బ - చౌఖండీ అని పిలువబడుతున్నది - ఒక అష్టభుజి గోపురంతో బయల్పడింది

[illegible]

*కలకత్తాకు చెందిన బి ఎం బిర్లా హార్ట్ రిసెర్చి సెంటర్‌కు చెందిన ప్రసిద్ధ హృద్రోగ శస్త్రవైద్యుడు డాక్టర్ ఎస్ పి షెట్టి నాయకత్వాన ఒక వైద్య బృందం వైద్యచరిత్ర సృష్టించింది వీరు ఓపెన్ హార్ట్ సర్జరీ చేయకుండానే 18 సంవత్సరాల బాలునికి శస్త్ర చికిత్స చేసి అతని గుండెలోని 5 మిల్లీ మీటర్ల రంధ్రాన్ని సరిచేయగలిగారు*

## 10,000 ఏళ్ళనాటి నిగూఢమైన శాలువ

*పశ్చిమ ఆస్ట్రేలియాలోని ఎల్లిన్‌గోప్ యొక్క గుహ పైకప్పునుంచి ఒక బ్రహ్మాండమైన పాతబడిన శాలువ వ్రేలాడుతుంటుంది అది అంచులతో కుచ్చులతో కూడి పూర్తిగా ఒక వివిధ వర్ణ విరాజితమైన ప్రాచ్యదేశపు శాలువగా కనిపిస్తుంది అది 14 అడుగుల పొడవు మరియు అంగుళంలో 1/6 వంత మందంతో ఉంటుంది గుహ పైకప్పు నుంచి 10,000 సంవత్సరాలుగా, బిందువులుగా కా[illegible] నీటి ద్వారా సున్నం వదిలంగా చేర్పబడి ఈ శాలువ సృష్టించబడింది!*

## శరీరంలో సగభాగం ఎముకలు

మానవ శరీరంలోని సగభాగం ఎముకలు - మణికట్టు చీలమండలు, చేతులు మరియు కాళ్ళల్లో ఉంటాయి

"[illegible] ఉండటం కంటే జన్మించకపోవటమే మంచిది జ్ఞాన [illegible] పేరు (ఉత్పత్తి)"

— [illegible]

బుద్ధుడు గయనుంచి లలిత్ పట్నాకు పయనిస్తూ, మార్గ మధ్యంలో మొదటి సారిగా ఐదుగురు తన వెనుకటి అనుచరులను కలిసిన చోటుకు గుర్తుగా ఈ స్థూపం నిర్మించబడింది ఆ ఐదుగురు త్వరలోనే ఆయన మతంలోకి చేరారు కూడా




143 అడుగుల ఎత్తునున్న ధమిక్ స్థూపం తప్ప జింకల ఉద్యానవనంలోని అన్నీ ధ్వంసం చేయబడ్డాయి అడుగున అధిక ప్రమాణంలోని రాతిఖండాలతో, పైభాగాన ఇటుకలతో ఇది నిర్మించబడింది

ఈ శిథిలాల సమీపంలోని వస్తు ప్రదర్శనశాలలో - మొట్టమొదటగా అశోక స్థూపాన్ని అధిరోహించిన నాలుగు సింహాల స్థూపాన్ని ఉంచారు ఈ నాలుగు సింహాల స్థూపం - ఇప్పుడు ఇండియా జాతీయ చిహ్నంగా రూపొందింది వస్తు ప్రదర్శనశాలలోని గౌతమబుద్ధుని ఇసుకరాతి ప్రతిబింబం భారతీయ మృదుకళా రంగంలో ఒక ఉత్కృష్ట కృతిగా నిలుస్తుంది

*వర్థమాన దేశాల (చైనా మినహాయించి) లోని 1,131 మిలియన్ పైగా నివాసులకు స్వచ్ఛమైన నీరు లభించటం లేదని అంచనా వేయబడింది వీరిలో 900 మిలియన్ మంది అనానుకూలమైన గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు ఇదికాక దాదాపు 1,750 మిలియన్ మందికి ఆరోగ్య పారిశుద్ధ్య సౌకర్యాలు లేవు వీరిలో దాదాపు 1 400 మిలియన్ మంది గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు*

## 2000 నాటికి యువజనాభా

*ప్రపంచంలో 2000 సంవత్సరం నాటికి 15 నుంచి 24 ఏళ్ళ వయస్సులోని వారి జనాభా దాదాపు 1,128 మిలియన్‌కు చేరుకుంటుంది*

## ఎంతో తెలివైన ప్రాణి




*తేలుకొండి నుంచి ధారగా వచ్చే నల్లని ఎసిటిక్ ఆసిడ్‌ను శత్రువుపైకి ఎగజిమ్మి ఆపదవేళల్లో తనను తాను రక్షించుకుంటుంది దీని తోక దగ్గర ఉన్న ఒక గ్రంధి ఈ ద్రవాన్ని ఉత్పత్తి చేస్తుంది దీన్ని అమోఘమైన ఫలితం వచ్చే విధంగా తేలు ఉపయోగించుకుంటుంది!*

"మనస్సు చాంచల్యమైనది ప్రమాదభరితమైనది శక్తివంతమైనది, మొండి పట్టుదలది, దీన్ని నియంత్రించటం గాలిని అదుపులో పెట్టటమంత కష్టసాధ్యంగా నాకు అనిపిస్తుంది"

— భగవద్గీత

రక్తానికి సంబంధించిన అంటువ్యాది - మలేరియా దీని పలితంగా చలి (శీతలం), అదిక జ్వరం వస్తుంది అంటువ్యాది సోకిన వ్యక్తి యొక్క రక్తం పీల్చిన దోమ - మరో వ్యక్తిని కుట్టి మలేరియా క్రిముల్ని లోపలికి ఎక్కిస్తుంది




మలేరియా చిహ్నాలు

ఇది ప్రతి 2 లేక 3 రోజులకు వస్తుంది కొన్ని గంటలపాటు ఉంటుంది దీనికి మూడు దశలు ఉన్నాయి

1. ఇది చలితోనూ, తరచుగా తలనొప్పితోనూ ప్రారంభమౌతుంది 15 నిమిషాల నుంచి గంట వరకు రోగి వణుకుతాడు
2. తరచుగా 40 డిగ్రీలు లేదా ఎక్కువగా వచ్చే జ్వరంతో కలిసి చలి వస్తుంది ఆ వ్యక్తి బలహీనంగా ఉండి, ఎర్రబడి, కొన్ని సందర్భాల్లో సందిప్రలాపాలు చేస్తూ ఉంటాడు
3. చివరికి, ఈ వ్యక్తి చమర్చటం ప్రారంబిస్తాడు అతని ఉష్ణోగ్రత బాగా తగ్గిపోతుంది ఒకసారి (రోగవు) దాడి జరిగిన తరువాత, అతడికి బలహీనంగా ఉంటుంది

* సాదారణంగా ప్రతి 2 లేక 3 రోజులకు జ్వరం వచ్చేటట్లు - మలేరియా చేస్తుంది (ఆ మలేరియా రకాన్ని బట్టి) కానీ మొదట్లో ప్రతి రోజు జ్వరం తగిలేటట్లు చేస్తుంది చిన్న

*నేను ఈ ప్రపంచం ద్వారా పయనించేది ఒక్కసారే కనుక, నేను చేయగల పని ఏదైనా ఉన్నా, సహచర ప్రాణిపైన నేను ప్రదర్శించ వలసిన కరుణ ఏదైనా ఉన్నా - దాన్ని ఇప్పుడే నన్ను చేయనివ్వండి నన్ను వాయిదా వేసుకోనివ్వ కండి నిర్లక్ష్యం చేయనివ్వకండి మరోసారి ఈ మార్గం వెంట నేను పయనించను కదా!*

— *స్టీఫెన్ గ్రిల్లెట్*

## ప్రపంచంలో పెద్ద ఎడారి



*ప్రపంచంలో పెద్ద ఎడారి - సహారా 3 500,000* చదరపు మైళ్ళ విస్తీర్ణంతో ఉంటుంది కొన్నిచోట్ల భూగర్భ నదులకోసం ప్రజలు ఇసుకను త్రవ్వినప్పుడు, స్వచ్ఛమైన నీటిలో జీవించిన చేపలను పట్టుకోగలుగుతారు

"ఏవిధంగా సేవ చేయాలనేది అన్వేషించి, కనుగొన్నవారు మాత్రమే మీలో నిజమైన సౌఖ్యం అనుభవించేవారు" — ఆల్బర్ట్ ష్వైట్జర్

పిల్లలల్లో, అంతకుముందు మలేరియా వచ్చిన వారిలో - ఈ జ్వరం తరహా క్రమబద్ధంగా, ఒక మాదిరిగా ఉండదు ఈ కారణంవల్లనే అంతుబట్టని జ్వరాలతో బాదపడే వారెవరైనా మలేరియాకు సంబందించిన రక్తపరీక్ష చేయించుకోవాలి

* విడవని (దీర్ఘకాలిక) మలేరియావల్ల తరచుగా పెద్ద ప్లీహం, పాండురోగం (రక్త వసుంది

విశ్లేషణ మరియు చికిత్స

* నీవు మలేరియాతో బాధపడుతున్నట్లు అనుమానిస్తే లేదా మఅల, మఅల వచ్చే జ్వరంతో బాదపడుతుంటే - ఒక కేంద్రానికి వెళ్ళి రక్తపరీక్ష చేయించుకో

*దగ్గరలో ఆరోగ్య కేంద్రం లేనట్లయితే క్లోరోక్విన్ కానీ, మీ ప్రాంతంలో బాగా పని చేసే ఏ మందైనా కానీ తీసుకో 150 మిల్లీగ్రాముల క్లోరోక్విన్ టాబ్లెట్స్ ఉపయోగిస్తున్నప్పుడు, పెద్దవాళ్ళు రోజుకు 4 బిళ్ళల చొప్పున 3 రోజులు తీసుకోవాలి

*క్లోరోక్విన్ వల్ల నీకు బాగయినప్పటికీ, కొన్ని రోజుల తరువాత తిరిగి జ్వరం ప్రారంభమైతే, నీకు మరో రకం ఔషధం (మందు) ప్రైమాక్విన్ వంటిది అవసరమౌతుంది నీకు సమీపంలోని ఆరోగ్య కేంద్రం సలహా తీసుకో

*మూర్ఛ లేదా ఇతర మెనింజైటిస్ (మేదో మజ్జారోగం) చిహ్నాలతో మలేరియా ప్రారంభమైన వ్యక్తికి సెరిబ్రల్ మలేరియా (మెదడుకు సంబంధించిన మలేరియా) వచ్చి ఉండవచ్చు తక్షణమే వైద్య సలహా కోరాలి

'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

## ఇండియాలో ప్రదమ జీవిత కధా చిత్రం

*సుబాష్ చంద్రబోస్‌పై పీయూష్ బోస్ 1956లో నిర్మించిన బయోపిక్చర్ ఇండియాలో మొదటి అధికారిక జీవిత కదా చిత్రం రెండవ అదికారిక చిత్రం 1983లో కాంగ్రెస్ నాయకుడు "ఆంద్ర కేసరి టి ప్రకాశం"పై తెలుగులో తీసిన చిత్రం*




## తమిళనాడులో కొత్తచట్టం

*పన్నులు, వీడియో ప్రదర్శనల మరియు సినిమా హాళ్ళలో వాహనాలను పార్కింగ్ చేయటంపై ఒక కొత్త చట్టాన్ని రూపొందించిన మొదటి బారతీయరాష్ట్రం - తమిళనాడు*

## 144 చిత్రాలలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ పాత్ర

*జగదీష్ రాజ్ అత్యధిక సంఖ్య - 144 చిత్రాలలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ పాత్ర ధరించాడు*

"క్రమమైన జ్ఞానం అనే బహుమానమే ప్రపంచంలోని ఉన్నతోన్నతమైన బహుమతి"

— రోజ్‌పాల్

ఫ్రాన్స్ రాజధాని, ఆదేశంలోని పెద్ద నగరమైన పారిస్ అనేక శతాబ్దాలుగా కళాపరంగానూ, సిద్ధాంతపరంగానూ ప్రపంచ నాయకత్వం వహించింది ప్రపంచంలోని సుందరమైన నగరాలలో ఇది ఒకటి




రోమ్‌కు చెందిన జూలియస్ సీజర్ (102-44 బిసి) గౌల్ (ఫ్రాన్స్ పూర్వపు పేరు)ను జయించినప్పుడు పారిస్ ఒక చిన్న మత్స్య గ్రామంగా ఉండేది అనంతరం రోమన్ చక్రవర్తుల క్రింద ఈ నగరానికి గణనీయమైన ప్రాచుర్యం లభించింది ఫ్రాంక్స్ రాజు తరువాత పశ్చిమ రోమన్ల చక్రవర్తి అయిన చార్లీమాగ్నె (742-814 ఏ డి ) దీన్ని పాండిత్య నగరంగా రూపొందించాడు ఇంగ్లండ్ మరియు ఫ్రాన్స్‌ల మధ్య సంఘర్షణవల్ల యూరప్‌లో జరిగిన వందేళ్ళ యుద్ధ సమయంలో (1337-1453 ఏ డి ) పారిస్‌ను ఆంగ్లేయులు ఆక్రమించుకున్నారు ఆనగరం కరవు కాటకాలతో, ప్లేగ్ వ్యాధితో వేదనకు గురైంది ఫ్రెంచి జాతీయ వీరాంగన జోన్ ఆఫ్ ఆర్క్ 1430లో బర్గుండియన్ల చేత బందించబడింది పారిస్‌ను తిరిగి కైవసం చేసుకునే ప్రయత్నంలో ఆమె ఇంగ్లీషువారికి అప్పగించబడింది 1436లో ఈనగరం ఇంగ్లీషు వారిని జయించటం ద్వారా తిరిగి కైవసం చేసుకోబడింది అప్పటినుండి పారిస్ అభివృద్ధి క్రమంగా సాగుతూ వచ్చింది

ఫ్రాన్స్ రాజైన XIIIవ లూయీ (1610-43), అతని ముఖ్యమంత్రి, ఫ్రాన్స్ యదార్థ పాలకుడు కార్డినల్ రిచిలియూల పాలనలో పారిస్ యూరప్ రాజకీయ కేంద్రంగా తయారయింది XIV లూయీ - 'సన్‌కింగ్' అని పిలువబడినవాడు- తన నివాసాన్ని పారిస్ సమీపంలోగల వెర్సైల్స్‌లోని ఒక వైభవోపేతమైన బవనానికి మార్చుకున్నాడు 18వ శతాబ్దిలో ఫ్రెంచి విప్లవ సమయంలో


Louvre Museum, Paris

XVI లూయీని, అతని బార్య మారీ ఆంటోనెట్టీని ఆగ్రహించిన మూకలు చంపివేశాయి

19వ శతాబ్దిలో, ఫ్రెంచ్ చక్రవర్తి ఒకటవ నెపోలియన్ ఆధ్వర్యంలో పారిస్ అభివృద్ధి చెందింది 1940లో జరిగిన రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మన్ సైనిక దళాలు పారిస్‌ను ఆక్రమించుకున్నాయి 1944లో చార్లెస్ డి గాలీ ఆధ్వర్యాన ఫ్రీ ఫ్రెంచ్ సైనిక దళాలు, అమెరికన్

సైనిక దళాలు కలిసి ఆనగరానికి దాస్య విముక్తి కలిగించాయి




Greek Sculpture Gallery in the Louvre Museum, Paris

ప్రస్తుతం పారిస్‌లో 2 8 మిలియన్ జనాభా ఉన్నారు దీని పరిసరాలలో 8 3 మిలియన్ ప్రజలు నివసిస్తున్నారు జనాభాలో దాదాపు 10 శాతం విదేశీయులు

దేశపు ఆటోమొబైల్స్ పరిశ్రమకు కేంద్రం పారిస్ మహత్తరమైన వైవిధ్యంగల వస్తువులను ఉత్పత్తి చేసే వందలాది కర్మాగారాలు కూడా ఇక్కడ ఉన్నాయి విలాస వస్తువులు, ఫ్యాషన్లు, సువాసన ద్రవ్యాలు, ఆభరణాలలో ఇది ప్రత్యేకత గడించింది

2000 సంవత్సరాలకు పైబడిన నగర చరిత్రకు శ్రీకారం చుట్టిన ఇల్లీ డిలా సిటీ - సీన్ నదిలోని ఒకదీవి - పారిస్‌కు హృదయస్థానంగా ఉన్నది 700 సంవత్సరాలకు పూర్వం నిర్మించిన కాదిడ్రల్ చర్చి - నాటర్ డామ్ - ఇక్కడ ఉన్నది ఈ చర్చిలోని విగ్రహాలు బైబిల్‌లోని వివిద మట్టాలను దృశ్యరూపంలో ప్రదర్శిస్తాయి రెండువైపులా నదీ తీరాలను అనుసంధానం చేస్తున్న వంతెనలు ఈ దీవిని కలుపుతున్నాయి

సుందరమైన కూడలులు, అందమైన ఉద్యానవనాలు, వైభవోపేతమైన భవనాల నగరం పారిస్ దారి వెంట చెట్లతో కూడిన వాహ్యాళి మార్గాలలో కొన్నిటిని వందేళ్ళక్రితం బారన్ హస్‌మన్ సృష్టించాడు

**పారిస్‌లో ఒక వెడల్పు గల వీధి - ర్యూడీ** రివోలీ - లో సిటీహాల్, ఒకప్పటి రాజసౌధం, నేడు మ్యూజియం మరియు ఆర్ట్ గ్యాలరీగా రూపొందిన లౌరీ నిల్చి ఉన్నాయి లౌరీ మ్యూజియంలోని వీనస్ విగ్రహం ప్రపంచంలోని అత్యంత సుందర స్త్రీ రూపంగా ఖ్యాతి గడించింది లియోనార్డో డా విన్సీ చిత్రించిన మోనాలిసా వర్ణచిత్రం ఇక్కడ ఒక గ్లాస్ షోకేస్‌లో భద్రపర్చారు అనురాగంతో ఆనందం




Mona Lisa in Paris

చిందిస్తున్న నేత్రాలుగల ఒక చిఱునవ్వుల స్త్రీ మూర్తిని ఇది ప్రతిబింబిస్తుంది

## మొదటి చంద్ర శిలల్లో పురాతనమైనది

*1971 ఆగస్ట్ 7న అపోల్లో XV చోదకులు భూమికి తెచ్చిన మొదటి చంద్రమండల శిలలలో పురాతనమైన శిలవయస్సు 4,200,000,000 సంవత్సరాలు*

"ఏదీ ప్రారంభం కాదు ఏదీ అంతం కాదు - అది దుఃఖం (మూలుగులతో) చెల్లించబడినప్పుడు ఎందుకంటే - మనం ఇతరుల వేదనలో నుంచి

ఎవెన్యూ డి చాంప్స్ - ఎలిసీస్ పారిస్‌లోని అందమైన వృక్షాల ఎల్లలుగల వీదుల్లో ఒకటి ఈ కూడలికి అంచున ఒకటవ నెపోలియన్ 1806లో ప్రారంభించిన ఆర్క్ డి ట్రయంఫ్ (ఆర్క్ ఆఫ్ ట్రయంఫ్) ఉన్నది నెపోలియన్ విజయాలకు ఇది స్మృతి చిహ్నంగా ఉంటుంది

Arc de Triomphe, Paris



దీని సమీపంలోని ఎల్సీ ప్యాలెస్ ఫ్రాన్స్ అధ్యక్షుని నివాస భవనం (ప్రస్తుత అధ్యక్షుడు - ఫ్రాంకోయిస్ మిట్టరాండ్)




సుందర ఉద్యానవనం - చాంప్స్ డి మార్స్ దగ్గర 984 అడుగుల ఎత్తు (300 మీటర్లు)గల ఈఫిల్ టవర్ ఉన్నది సీన్‌నది ఒడ్డునగల ఈ టవర్ - నగరానికి ఒక సరిహద్దు రేఖగా నిల్చి ఉన్నది ఇది 2,500,000 చీలల అతుకులుగల, 12,000 ఉక్కు బాగాలతో నిర్మితమైంది పారిస్ ఎగ్జిబిషన్ కోసం దీనికి అలెగ్జాండ్రా గుస్టవ్ ఈఫిల్ రూపురేఖలు కల్పించాడు 1889 మార్చి 31న దీని నిర్మాణం పూర్తి చేశాడు దీని నిర్మాణానికి 2 సంవత్సరాల, 2 నెలల, 2 రోజులు పట్టింది 7,799,401 ఫ్రాంక్స్, 31 సెంటిమ్స్ ఖర్చయింది

ఒక ప్రసిద్ధ బవనం - ది హోటల్ డెస్ ఇన్వాలిడిస్‌లో - నెపోలియన్ సమాది ఉన్నది సర్వదేవ మందిరం (Pantheon)- ప్రభావితం చేసే గుమ్మటంతో ఉన్న ఈ చర్చిలో ఫ్రెంచి వేదాంతులైన వోల్టేర్, రూసోలు, ఫ్రెంచి నవలాకారుడు విక్టర్ హ్యూగో సమాది చేయబడ్డారు పాలెస్ ఫాంటైనిబ్లూ 2,000 గదులు కలిగి ఉన్నది ఇక్కడ నెపోలియన్ నివసించాడు

## ప్రపంచంలో రెండవ పెద్ద ద్వీపం

*పసిఫిక్ సముద్రం నైఋతి దిక్కులోని - పక్షి ఆకారంలో ఉండే దీవి - న్యూగినియా 2 ½ మిలియన్ జనాభాలో 700 వివిధ భాషలు మాట్లాడే దాదాపు 1000 తెగలు ఉన్నాయి ప్రకృతి వనరులలో భాగ్యవంతమైన 600 దీవులలో వీరు చెల్లా చెదరుగా ఉంటారు ప్రపంచంలో రెండవ పెద్ద ద్వీపం - న్యూగినియా*

## అరకిలో బ్రెడ్‌లో పోషక పదార్థాలు

*మానవునకు ప్రతిదినం కావలసిన ప్రోటీన్, కార్బోహైడ్రేట్స్, విటమిన్ 'బి', విటమిన్ 'ఇ' మరియు అనేక ఖనిజ పదార్థాలలో 50 శాతానికి పైగా అరకిలో మంచి బ్రెడ్ సమకూర్చగలుగు తుంది*

"మానవాళికి సేవ చేయటం ద్వారా భగవంతుణ్ణి చూసేందుకు నేను ప్రయత్నిస్తున్నాను ఎందుకంటే - దేవుడు అటు స్వర్గంలో కానీ, ఇటు క్రింది

ప్రపంచంలోని అత్యంత అందమైన భవనం - పారిస్ సమీపంలోని వెర్సైల్స్ పాలెస్ అని చెప్పబడుతున్నది ఇక్కడి గదులు - కుడ్యాలపై వర్ణ చిత్రాలతో, శిల్పాలతో, ఇంపైన పైకప్పులు మొదలైన వాటితో వైభవంగా కనిపిస్తాయి ప్రపంచంలో అత్యంత పెద్ద నాటకశాల - ఒపెరా - వైభవంగా అలంకృతమై, ఒక దేదీప్యమానమైన సాక్షాత్కారంగా అనిపిస్తుంది


Opera House, Paris

పారిస్‌లోని లాటిన్ క్వార్టర్‌లో స్థాపితమైన యూనివర్శిటీ ఆఫ్ సోర్‌బొన్ని - యూనివర్శిటీ ఆఫ్ పారిస్ సంప్రదాయనామం - రాబర్ట్ డి సోర్‌బన్ 1253లో స్థాపించిన మొదటి కళాశాల నుండి అభివృద్ధి చెంది యూనివర్శిటీగా రూపొందింది తొలినాళ్ళలో సిద్ధాంత అధ్యయనానికి పేరొందిన ఈవిశ్వవిద్యాలయం 19వ శతాబ్దిలో పునర్వ్యవస్థీకరించబడింది

అనేక అంతర్జాతీయ విమానాశ్రయాలు, అనేక రైల్వే కూడలులు పారిస్‌లో ఉన్నాయి దీని ఓడరేవు ఏ ఇతర ఫ్రెంచి రేవులు కూడా చేయలేనంతగా భారీ సరకుల్ని రవాణా చేస్తుంది రాత్రివేళల్లో నగరంలోని స్మారక చిహ్నాలను, వాహ్యాళి బాటలను వెలుగుకాంతులతో ప్రకాశింపజేస్తారు కనుకనే దీన్ని "కాంతినగరం" అని పిలుసారు

## ప్రపంచంలో నిషి

*ప్రపంచంలో భారీమనిషి ఇల్లినాయిస్ (యుఎస్ఏ) లోని మోంటిసెల్లోకు చెందిన 6 అడుగుల 1/2 అంగుళం పొడవుగల రాబర్ట్ ఎర్ల్ హుగ్స్ - 1926లో జన్మించాడు ఆరేళ్ళప్రాయంలో అతడు 203 పౌన్లు తూగాడు 1958 జూలై 10న అతడు చనిపోయినప్పుడు 1,041 పౌన్లు బరువు ఉన్నాడు ఒక పియానో పెట్టె సైజు గల శవపేటికలో అతడు పూడ్చివేయబడ్డాడు*

## ఇండియా వజ్రాలు

*ప్రపంచం మొత్తం మీద ఆభరణాల్లోకి అలంకరించబడిన ప్రతి ఐదు వజ్రాలలోనూ నాలుగు వజ్రాలు ఇండియా నుంచి వచ్చినవే*

## నెపోలియన్ లేఖ వేలం



*ఇంగ్లండ్‌ను జయించేందుకు కావలసి రహస్య పథకాలను సంక్షిప్తంగా వివరిస్తూ ఫ్రెంచ చక్రవర్తి నెపోలియన్ బోనపార్టీ వ్రాసిన నాలుగు పేజీల చేతివ్రాత ఉత్తరం పారిస్‌లో జరిగిన వేలంలో - 21,186 డాలర్లకు ఒక ఫ్రెంచి సంగ్రహకారునకు విక్రయించబడింది*

"ఒక సంకట స్థితిని దాటేందుకు దగ్గరిది, తేలికైనది మరియు ఉత్తమ మార్గం - దాని ద్వారా దాటటమే"

డా ఇందురేఖా త్రిపాఠీ

రాతియుగంలో మానవుడు మొదటిసారి సేద్యం చేసినది - బార్లీ హిందీలో దీన్ని 'జావ్' (Jao) అని పిలుస్తారు ఇండియాలో వేడిమి, తేమ శీతోష్ణస్థితిగల కొన్ని రాష్ట్రాలలో బార్లీని ఎక్కువగా పండిస్తారు వరి, గోధుమ, రై (గోధుమ వంటి ధాన్యం), బజ్రా, రాగి వగైరాల వలెనే బార్లీ కూడా తృణధాన్యాలలోనిది బార్లీని తృణధాన్యంగా పరిగణించినా, తృణ ధాన్యంగా దాని ఉపయోగం అత్యల్పమే




ప్రాతఃకాల అల్పాహారవు తృణధాన్యాల ఆధారంగా ఆస్ట్రేలియాలోని ఆహార శాస్త్రజ్ఞులు ఒక రకం ధాన్యపు విత్తనం తయారు చేశారు రుచిగా లేకపోయినా, మైనంవలే ఉండే బార్లీ ఎక్కువ పీచుతో ఉండి, రక్తంలో కొలెస్టరాల్ స్థాయిలను తగ్గించేందుకు తోడ్పడుతుంది

తృణ ధాన్యాల వాడకంలో ప్రపంచం మొత్తంమీద హెచ్చు తలసరి వినియోగం చేసే ఆస్ట్రేలియాలో భోజనాల బల్లపైన కొత్త వస్తువు- "బాలెన్స్" అనే బ్రాండ్ పేరిట కనిపిస్తుంది

ఇనుము మరియు ఫాస్ఫరిక్ ఆసిడ్ ఉన్న అత్యంత పోషక ఆహారంగా బార్లీ పరిగణింప బడుతున్నది తక్కువ బరువు కలవారు బరువు పెంచుకునేందుకు ఇది తోడ్పడుతుంది పొట్టలోని పుండ్లు, అతిసారం, దంతాలు పాడవటం, జుట్టు ఊడిపోవటం వంటి వ్యాధుల్లో ఉపశమనకారిగా ఉపయోగించబడుతున్నది చేతి లోనూ, కాళ్ళలోనూ, ఉన్న గోళ్ళస్థితిని పెంపొందించేందుకు, రక్తపుపోటు తగ్గించేందుకు, జ్వరాలకు కూడా ఇది ఉపయోగపడుతుంది అనారోగ్యంతో ఉన్నప్పుడు తీసుకునే పానీయంగా ఇది పేరొందింది

బార్లీని ప్రాతఃకాల అల్పాహారంలోకి - అంబలి (గంజి)గా కూడా తయారు చేసుకోవచ్చు. ఒక కప్పు బార్లీతో కలిపి 3 నుంచి 4 కప్పుల నీటిని కాగబెట్టండి మరింత ఆకలి కలిగించేందుకు, సత్తువ కలిగించేందుకు పాలను, ఎండు ద్రాక్ష పళ్ళను చేర్చండి తీపిదనం కోసం బెల్లం కానీ, తేనె కానీ ఉపయోగించవచ్చు 50 శాతం బార్లీ మరియు 50 శాతం గోధుమ విసిరి పొడి చేసి చపాతీలు చేసుకోవచ్చు ఇది మంచి రుచిని ఇస్తుంది వేసవి పానీయంగా దప్పిక తీర్చుకునేందుకు నిమ్మరసంతో కలిపి దీన్ని ఉపయోగించవచ్చు.

—'హెల్త్ హెరాల్డ్' సౌజన్యంతో

## ప్రపంచంలో ఎత్తైన జలపాతం

*ప్రపంచంలో అత్యంత ఎత్తున ఉన్న జలపాతం - వెనిజులా (దక్షిణా అమెరికా) లోని ఏంజల్ ఫాల్స్ ఇక్కడ జలాలు 3,212 అడుగుల ఎత్తు నుంచి క్రిందికి పడతాయి ఇది నయాగరా జలపాతం కంటే ఎత్తులో 18 రెట్లు హెచ్చు*

"ఒక పనిని న్యాయంగా చేసేందుకు తక్కువ కాలం పడుతుంది - దాన్ని అన్యాయంగా చేసినందుకు సంజాయిషీ ఇచ్చుకునే సమయం

# నిజాలు - నిదర్శనాలు

## చేతిమగ్గాలపై ఆధారపడిన 75 లక్షల కార్మికులు

దేశంలోని వస్త్రాల అవసరాలలో ఇండియాలోని వస్త్రాల మిల్లులన్నీ కలిసి 25 శాతం తీరుస్తాయి చేతి మగ్గాల రంగం 35 శాతం తీరుస్తుంది దేశంలోని 75 లక్షలకు మించిన నేత పనివారు చేతి మగ్గాలపైన ఆధారపడతారు 13 లక్షల పనివారు వస్త్రాల మిల్లులలో పని చేస్తారు దాదాపు 11 లక్షల మంది పనివారు పవర్‌లూమ్‌లతో పని చేస్తారు దేశం నుండి ఎగుమతుల్లో 1000 కోట్ల రూపాయల మేరకు చేతి మగ్గాల రంగం నుంచే జరుగుతున్నది

## ఇండియాలో బోదకాలు వ్యాధి

ఇండియాలో దాదాపు 304 మిలియన్ ప్రజలు ఫైలేరియాసిస్ (బోదకాలు లేక ఏనుగు కాలు) సోకే వ్యాధికి లోనయ్యారు వీరిలో 22 మిలియన్ మంది మైక్రోఫిలేరియా కారియర్లు కాగా, 16 మిలియన్ మందివి దీర్ఘకాలిక బోద వ్యాధి కేసులు బోద వ్యాధి బాగా ఎక్కువగా లోనైన రాష్ట్రాలు ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, తమిళనాడు, కేరళ, బీహార్ మరియు పాండిచ్చేరి కేంద్ర పాలిత ప్రాంతం

## 25 లక్షల మంది ఆయుర్వేద వైద్యులు

ఇండియాలో దాదాపు 25 లక్షల మంది రిజిష్టర్డ్ ఆయుర్వేదిక్ ప్రాక్టీషనర్స్‌గా ఉన్నారు ప్రతి సంవత్సరం దాదాపు 100 ఆయుర్వేద కళాశాలలు 3,500 పట్టభద్రుల్ని తయారు చేస్తున్నాయి దేశంలో 1500 ఆయుర్వేద ఆస్పత్రులు 16,000లకు పైగా పడకలు కలిగి ఉన్నాయి

## పట్టణ ప్రాంతాల్లో 90 శాతం డాక్టర్లు

ఇండియాలో 76 శాతం జనాబా గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నా, 84 శాతం ఆస్పత్రి పడకలు మరియు 90 శాతానికి పైగా డాక్టర్లు పట్టణ ప్రాంతాలలోనే కేంద్రీకరించబడ్డారు స్వాతంత్ర్యానంతరం (1947) వ్యాప్తి చెందే వ్యాధుల అదుపు ద్వారా ఒక వ్యక్తి జీవితకాలం 54 7 సంవత్సరాలు (27 నుంచి)గా అభివృద్ధి చెందింది

## ప్రపంచంలో నీటివ్యాప్త వ్యాధులు

ప్రతి సంవత్సరం ప్రపంచమంతటా - టైఫాయిడ్, పసికర్లు, మలేరియా, అతిసారం, గ్రహణి (విరేచనాలు) వంటి నీటివల్ల వచ్చే రుగ్మతలు, వ్యాధులవల్ల దాదాపు 10 మిలియన్ ప్రజలు మరణిస్తున్నారు ఈ వ్యాధులకు 80 శాతం వరకు కారణం శుభ్రమైన నీరు లేకపోవటం మరియు తక్కువ ఆరోగ్య రక్షణ దీనివల్ల ప్రతి సంవత్సరం 73 మిలియన్ పని రోజులు నష్టమౌతున్నాయి

# అవార్డు

## అత్యంత ప్రజాదరణ పొందిన చిత్రం

బొంబాయి జీవితంలోని అణగారిన బ్రతుకుల్ని వెలికి చూపిన చిత్రం- "సలాం బాంబే"- మాంట్రియల్ చలన చిత్రోత్సవంలో అత్యంత ప్రజాదరణ పొందిన చిత్రంగా మూడు అంతర్జాతీయ అవార్డులను అందుకున్నది అంతకుక్రితం ఈచిత్రం కాన్స్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో "గోల్డెన్ కెమెరా అవార్డు" పొందింది

"ఏదైనా ఒక పని తప్పు అని నీకు నిశ్చయమైతే దాన్ని ఎంతమాత్రం చేయవద్దు ఒక పని సక్రమమైంది అని నీకు నిశ్చయమైతే దాన్ని తప్పకుండా చేయి"

# దీర్ఘకాలం జీవించే వృక్షం

నీటా కాల్విన్

ప్రపంచంలో ఎక్కువకాలం జీవించే చెట్లలో ఒకటి - రావి చెట్టు ఇది వందలాది సంవత్సరాలు జీవిస్తుంది ఇది 15 మీటర్ల ఎత్తువరకు పెరుగుతుంది రావిచెట్టును - హిందువులు, బౌద్ధులు - ఉభయులూ పూజిస్తారు




దీన్ని హిందువులు తమ దేవాలయాల వద్ద నాటుకుంటారు బుద్ధ భగవానునకు రావి చెట్టు క్రిందనే జ్ఞానోదయం కలిగిందని బౌద్ధుల విశ్వాసం

కొన్ని అస్వాభావికమైన సంఘటనలతో సంబంధకలవిగానూ లేదా దయ్యాలు నివసించేవి గానూ రావిచెట్లను గురించి గ్రామాలలో కథలు వ్యాపించి ఉంటాయి

రావిచెట్లు నేడు ఇండియా అంతటా విస్తరించాయి. మఱ్ఱి చెట్టు వలెనే ఇది కూడా అశ్వత్థ కుటుంబానికి చెందినది.

దీని పెరుగుదల తొలిదశలో - రావిచెట్టు పొరుగు గోడపైకానీ చెట్టుపై కానీ వృద్ధి చెందుతుంది. దీని వ్రేళ్ళు గోడనూ లేదా చెట్టునూ కూడా ఈ చెట్టు తన పోషకాహారాన్ని మరియు నీటి నుంచి పొందుతుంది. దీని ఆకుల కొనలు సూటిగా మొనదేలి ఉన్నందువల్ల వర్షం పడిన వెంటనే ఆకుల నుంచి నీళ్ళు కారిపోతాయి చెట్టు పొడిగా, తేలికగా ఉండేందుకు ఇది తోడ్పడుతుంది

రావిచెట్లు జంటలుగా పెరుగుతాయి ఇవి కీటకాలకు స్థిరమైన స్థావరాలుగా ఉంటాయి ఈ చెట్టును పక్షులు, గబ్బిలాలు సందర్శిస్తాయి పండ్లను ఆశతో మ్రింగి విత్తనాలను వెదజల్లి, వృక్షం వ్యాప్తి చెందేందుకు తోడ్పడతాయి

రావి తోలులో టానిన్ అనే ఔషధ గుణాలు ఉన్నాయి ఈ రావి పట్టా లేక తోలును నీటిలో కరిగించి అల్సర్లు (వ్రణాలు), చర్మవ్యాధుల నివారణకు ఉపయోగిస్తారు దీని ఆకులు, మృదువైన రెమ్మలు విరేచన ఔషధంగా ఉపయోగించబడతాయి పశువులకు, ఏనుగులకు మేలైన పశుగ్రాసంగా కూడా ఇది ఉపయోగ పడుతుంది

రావిచెట్లు దారి వెంట కూడా పెరుగుతాయి నీడనిచ్చే ఈ చెట్టు వేడిమి నుంచి, అలసట నుంచి ప్రయాణీకులకు నీడనిస్తుంది ఏ ఇతర వృక్షం మాదిరిగానే, రావిచెట్టు కూడా నేలను సారవంతం చేసి, మన్ను హరించి వేయటాన్ని అరికట్టి, గాలిని పరిశుభ్రం చేస్తుంది

— 'సిఐఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

'ఆనందం ఆలింగనం చేసుకుంటుంది అయితే సంతోషం క్షణభంగురం

# పత్రికా రచనారంగంలో వినోదం

ఎడ్డీ ఫెర్నాండెజ్

వెనుక ఎప్పుడో - 1958లో ఒక బొంబాయి వార్తాపత్రికకు చెందిన రిపోర్టర్‌ను ఒక కాన్ఫరెన్స్ హాల్‌లో జరుగుతున్న ఇన్సూరెన్స్ కంపెనీ వార్షిక సర్వసభ్య సమావేశానికి హాజరై దాన్ని



గురించి వ్రాసుకురమ్మని ఆదేశించారు ఈ సమావేశాన్ని యాదృచ్ఛికంగా భావించి ఉదయం పేపర్లో వచ్చిన ప్రకటన ఆధారంగా ముందుగానే ఒక నివేదిక తయారు చేసిన రిపోర్టర్ భోజనానంతరం ప్రశాంతంగా ఇంటికి వెళ్ళిపోయాడు అయితే ఆ సమావేశంలో గందరగోళం ఏర్పడి, పెనుతుపాను వీచినట్లయి రద్దయింది మరునాటి ఉదయం ఆ పత్రిక ఎంత అవివేకిగా కనిపిస్తుందో, ఆ రిపోర్టర్ ఎంత మూఢునిగా తనకు తాను ఋజువు చేసుకున్నాడో తెలుస్తుంది

ఇటువంటి పొరపాటే మరో పత్రిక కూడా చేసింది బక్రీద్ రోజున అజాద్ మైదానంలో జరిగే ప్రాతఃకాల ప్రార్థనలకు హాజరై దాన్ని గురించి వ్రాయమని రిపోర్టర్‌నూ, ఫోటో గ్రాఫర్‌నూ కోరారు ఈ ప్రార్థనలు యథాప్రకారం జరుగుతాయనే అభిప్రాయంతో ఇద్దరూ అక్కడికి వెళ్ళకుండా దాటవేశారు రిపోర్టర్ తన నివేదిక సమర్పించాడు ఫోటోగ్రాఫర్ గత సంవత్సరం తీసిన చిత్రాన్నే తిరిగి ఇచ్చాడు అయితే ఈద్ చంద్రుడు కనిపించనందువల్ల ఈద్ ఉత్సవాలు ఆ మరునాటికి వాయిదా పడ్డాయి సంజాయిషీ అడిగినప్పుడు రిపోర్టర్ - చంద్రుడు అటువంటి యుక్తులు ప్రదర్శిస్తాడని తాము ఎలా తెలుసుకోగలుగుతామనీ, అది చందమామపై మానవులు దిగినందుకు ఫలితం కావచ్చుననీ చెప్పాడు అలాగయితే - చంద్రునిపై దిగినవారి వద్దనే వేతనాలు తీసుకోవలసిందని వారిద్దరికీ ఎడిటర్ చెప్పాడు

ఈ సంఘటన ద్వారా వార్తాపత్రికల్ని ప్రకటనలు ఎంత మేరకు ప్రభావితం చేస్తాయో నిర్ణయించుకోవచ్చు తన కుక్క తప్పిపోయిందనీ, కనుగొన్నవారికి వెయ్యి రూపాయలు పారితోషికం ఇస్తానని ఒక వృద్ధ వనిత ఒక

## ఆసియాలో అత్యంత ఐశ్వర్యవంతులు

***ఆసియాలో సింగపూర్ వాసులు, హాంగ్‌కాంగ్‌లోని చైనీయులు అత్యంత ఐశ్వర్యవంతులు ఆసియా యొక్క ఐశ్వర్య వంతుల తెగలలోని హాంగ్‌కాంగ్ చైనీయుల రమారమి కుటుంబ ఆదాయం - 146,000 అమెరికన్ డాలర్లు కాగా సింగపూర్ వాసులు 0 47 మిలియన్ డాలర్ల మేరకు కుటుంబ సంబంధమైన పెట్టుబడులు పెట్టి ఎక్కువగా ఆదా చేస్తారు***

—ఫార్ ఈస్టర్న్ ఎకనామిక్ రివ్యూ సర్వే

"రాజ్యాలు, సింహాసనాలకంటే నేను జ్ఞానానికే ప్రాధాన్యం ఇస్తాను జ్ఞానం ముందు సంపదలు ప్రయోజనం లేనివని నేను నమ్ముతాను జ్ఞానం

వార్తాపత్రికలో ప్రకటన చేసింది ఎడిటర్ తన మధ్యాహ్నం భోజనం, స్వల్పనిద్ర ముగించుకుని, పనిచేసుకునేందుకు కార్యాలయానికి వచ్చినప్పుడు అక్కడ కాపలా మనిషి మినహా ఎవ్వరూ లేరు వారంతా ఎక్కడికి వెళ్ళారని అతడు కాపలా మనిషిని అడిగాడు ఆ ఉదయం పత్రికలో వచ్చిన ప్రకటన చూసి తప్పిపోయిన కుక్కను వెదకటానికి అడ్వర్టయిజింగ్ మేనేజర్‌తో సహా అందరూ వెళ్ళారని అతడు చెప్పాడు!

ఏప్రిల్ ఫూల్స్ రోజున వార్తాపత్రికలపైన, పాత్రికేయులపైన ఎన్నో ఆచరణీయమైన పరిహాసాలు చేయటం జరుగుతుంది రంజీ ట్రోఫీలో విజయం సాధించిన మైసూరు జట్టును తాను సత్కరించబోతున్నట్లు ఒక మైసూర్ మంత్రి బెంగుళూరు జర్నలిస్టులపైన ఒక కుచేష్ట ప్రదర్శించాడు రిపోర్టర్లు అక్కడికి చేరగానే అది ఏప్రిల్ ఫూల్ జోక్ అని చెప్పటం జరిగింది

ఎన్నడూ అధ్యయనం చేయకుండానే పాత్రికేయ వృత్తిలోకి నేను ఎలా ప్రవేశించ గలిగానో తెలుసుకోవాలని చాలామందికి కుతూహలంగా ఉంది వాస్తవానికి ఫ్రీ-లాన్సింగ్ (స్వేచ్ఛా రచన) చేస్తున్నప్పుడే నేను ఒక ఇంజనీరింగ్ ఉద్యోగంలో ఉన్నాను రెండు సంవత్సరాలు ఫ్రీ-లాన్సర్‌గా పనిచేసిన తరువాత ఎడిటర్ నన్ను క్రమమైన ఉద్యోగిగా తీసుకోవాలని భావించాడు లోకజ్ఞానానికి సంబంధించిన కొన్ని యుక్తమైన ప్రశ్నలు వేశాడు దురదృష్టానికీ, దుర్ఘటనకూ మధ్య తేడా ఏమిటని నన్ను ప్రశ్నించాడు ఇది యుక్తమైన ప్రశ్నే నిఘంటువు చూసేందుకు అవకాశం లేదు నుక నేనొక ఉదాహరణ ఇచ్చాను "ఎడిటరైన మీరు ఒక మురికికాలువలో పడినట్లయితే అది దురదృష్టం, ఎవరైనా మిమ్మల్ని కాపాడి నట్లయితే అది దుస్సంఘటన అవుతుంది" అన్నాను నాకు ఉద్యోగం లభించింది కొన్నేళ్ళ పాటు దానిలోని ఆనందాన్ని ప్రతిక్షణం నేను అనుభవించాను

మా న్యూస్ ఎడిటర్ ఒక రోజున మమ్మల్ని తన గదిలోకి ఆహ్వానించి, మేము స్థిరంగా, సంతోషంగా పనిచేస్తుంటే చూడాలనే తన అభిలాష వ్యక్తం చేశాడు ఏవైనా సలహాలు ఇవ్వదలచుకున్నట్లయితే వాటిని తన పెట్టెలో వేయవచ్చునని చెప్పాడు మర్నాటి ఉదయమే ఒక సలహా వచ్చింది "మీ పాదరక్షల నుంచి రబ్బర్ హీల్స్ తీసివేయండి"

నా సబ్ ఎడిటర్ మిత్రుడు నిద్రపోతూ రెండుసార్లు పట్టుబడ్డాడు అత్యధిక వార్తా పత్రికలు - సూర్యుడు, చంద్రుడు మరియు సముద్రము ఆటుపోట్లు (తారాబలం - చంద్ర బలం, పంచాంగం వంటివి) ప్రచురిస్తాయి ఒక రోజున సూర్యోదయం - 6 30 పి ఎం (సాయంకాలం)కు జరిగినట్లు పొరబాటున ప్రచురించబడింది దీన్ని అనుమతించిన వ్యక్తిని నిలదీశారు ఆ మరునాడు చంద్రోదయం 7 30 ఎ ఎం (ఉదయం)కు జరిగినట్లు ఉంటే వెంటనే సవరించి 7 30 పి ఎం (సాయం కాలం)గా మార్చాడు సూర్యచంద్రులు ఎప్పుడు ఉదయిస్తారో, ఎప్పుడు అస్తమిస్తారో అతడు ఇప్పుడు నేర్చుకున్నాడు

## అపూర్వ విషయాలు

### టోపీ పైన గ్రుడ్డు

*న్యూయార్క్ సిటీ (యు ఎస్ ఎ) లో ఒక వీధిలో విటో డి లుకా నడిచి వెళ్తుండగా ఒక పావురం అతని టోపీ పైన గ్రుడ్డుపెట్టింది!*

"జ్ఞాన హీనునిగా ఉండటం - మనిషికి ప్రత్యేకాధికారం కాదు, తాను జ్ఞాన శూన్యుణ్ణని తెలుసుకోగలగటం - అతని ప్రత్యేక హక్కు"

మీకు ఒక లోతైన గాయం ఏర్పడినా, లేదా ఒక బాధాకరమైన వాత లేక కాలిన గాయం ఏర్పడినా, లేదా ఒక కొయ్య లేక లోహపు ముక్క మీ చేతిలో దిగబడినా, మీ కంటిలో ఏదో బాధ ఏర్పడినా, మీలో చాలామంది - మీకు మీరుగానే - జాగ్రత్త తీసుకుంటారు లేదా మీ స్నేహితుల్లో ఎవరో ఒకరు సహాయపడతారు స్వల్ప గాయమే తరచుగా ఎక్కువ ఇబ్బంది కలిగిస్తుందనీ, అది అత్యంత ప్రమాదకరంగా తయారవుతుందనీ మీలో చాలామంది బహుశా గ్రహించకపోయి ఉండవచ్చు

అనేక సందర్భాలలో మీరు ఏమి చేయాలో మీ మిత్రులే చెబుతారు గాయాలపైన పొగాకు రసం పొయ్యటం, ఒక గాయపు కోత నుంచి "రక్తాన్ని పిండటం" వంటి ఇష్టం వచ్చిన, భ్రమాజనితమైన చికిత్సలపట్ల జాగ్రత్త వహించండి ఇవి ఏవిధమైన మంచినీ చెయ్యకపోగా ఎంతో హాని కూడా కలిగిస్తాయి

**అధిక అంటు వ్యాధులకు కారకులైన సూక్ష్మ** క్రిములు మీ చర్మంపైనా, నేలమీదా, మీ స్నేహితుని చేతులలోనూ హాజరుగా ఉంటాయి మీకంటిలోని నలుసును తీసేందుకు సిద్ధపడిన మీ మిత్రుని చేతుల్లోనూ ఉండవచ్చు ఈ సూక్ష్మజీవులు ఏచిన్న గాయం లేదా కోతపైనైనా దాడి చేస్తాయి చర్మం వెలుపల ఈ సూక్ష్మ జీవులు సాధారణంగా హాని కలిగించవు కానీ చర్మం ఎక్కడైనా విచ్ఛిన్నమై ఉన్నట్లయితే ఇవి లోపలికి వేగంగా చొచ్చుకుపోయి తమ పని ప్రారంభిస్తాయి ఇది జరిగినపుడు మీరు ఏదో ఒక వ్యాధితో బాధపడక తప్పదు

ఆరుగంటల సమయంలో ఒక సూక్ష్మజీవి - అత్యధికంగా - 4000కు పైగా జీవులుగా వృద్ధి చెందుతుంది మీచేతి వ్రేలికొన నుంచి భుజానికి ప్రయాణం చేసేందుకు అది 8 నుంచి 10 నిమిషాలు మాత్రమే తీసుకుంటుంది

అనేక ఔషధాలు ఈ సూక్ష్మజీవుల్ని చంపివేయగలవు లేదా వాటిని మందగింపచేయగలవు అవి విజయవంతం కాకపోతే మీరు నెప్పితో, అసౌకర్యంతో బాధపడతారు కనుక మీరు ఎప్పుడూ ఒక నిపుణుని సలహా మరియు వైద్యుని సంరక్షణ తీసుకోవాలి

ప్రతి గాయాన్ని ప్రాథమిక చికిత్స కోసం

## ఈ శతాబ్దిలో పెద్ద విస్ఫోటనం




*1991 జూలైలో ఫిలిప్పీన్స్‌లో మౌంట్ పినటుబొ అగ్ని పర్వత విస్ఫోటనం - ఈ శతాబ్దిలోని అతి పెద్ద విస్ఫోటనం కావచ్చునని యునైటెడ్ స్టేట్స్ ఉపగ్రహాలు తెచ్చిన చిత్రాలు వెల్లడిస్తున్నాయి ఈ అగ్నిపర్వత విస్ఫోటనం వల్ల భూమి ఉపరితల వాతావరణంలోకి మిలియన్ల మెట్రిక్ టన్నుల అగ్ని పర్వతపు (వేడి) బూడిద మరియు సల్ఫర్ డైఆక్సైడ్ వాయువు విడుదల చేయబడ్డాయి*

'ధనార్జన కోసం సద్గుణాన్ని విక్రయించవద్దు, అధికారం కోసం స్వేచ్ఛను అమ్ముకోవద్దు''
— బెంజమిన్ ఫ్రాంక్లిన్

ఎప్పుడూ నివేదించండి మీ గాయాలకు ఇతరులు చికిత్స చేసేందుకు అంగీకరించకండి వారు అసలు గాయంకంటే ఇంకా ఎక్కువ హాని చేస్తారు గాయంపైన ఒకపాత గుడ్డ పీలిక లేదా ఒక మురికి చేతి గుడ్డ వెయ్యకండి గాయాన్ని ఒక శుభ్రమైన కాగితపు టవల్‌లో మూసివేయండి

బహిర్గతంగా ఉండే ఒక కోతను కానీ ుయ్యను కానీ తాకవద్దు అలా మీరు చేసినట్లయితే - అంతకుక్రితమే ఆగాయంలో చొరబడి పని చేస్తున్న సూక్ష్మజీవులకు తోడు మీరు మరికొన్ని అదనంగా అందించినట్లవుతుంది మీ చర్మం నుంచి వార్నిష్ మైనం (లక్క), తారు తొలగించేందుకు ప్రయత్నించవద్దు ఒక కాలిన గాయం పైనున్న గుడ్డను లాగటంకానీ, చింపటం కానీ చేయవద్దు మీరు దాన్ని కతిరించవలసి ఉంటుంది

మీ కళ్ళకు ఏదైనా అయితే వాటిని రుద్దకండి అలాగే కంటిని పట్టుకుని, ప్రాదమిక చికిత్స కోసం త్వరపడండి

— "ఇండస్ట్రియల్ సూపర్‌వైజర్" సౌజన్యంతో

## వ్యక్తికి ప్రాధాన్యం లేకపోతే

వ్యక్తికి ప్రాధాన్యం లేనప్పుడు ఇక సంఘంలో మిగిలేదేమిటి? వ్యక్తిగత స్వేచ్ఛ మాత్రమే మనిషిని సంఘానికి సేవ చేసేందుకు, స్వచ్ఛందంగా తనకు తానే లొంగిపోయేందుకు దోహదం చేస్తుంది అతని వద్ద నుంచి దీన్ని లాక్కున్నట్లయితే అతడు స్వేచ్ఛగా గుండ్లను పేల్చే ఒక తుపాకీగా మారిపోతాడు, సంఘం సర్వనాశనమవుతుంది వ్యక్తి స్వేచ్ఛను కాదని ఏసంఘం కూడా నిర్మాణం కాజాలదు

— మహాత్మాగాంధీ

## ఒలింపిక్ క్రీడాస్థలాలు



ఆదునిక కాలంలో మొదటి ఒలింపిక్ క్రీడలు ఏదెన్స్ (గ్రీస్)లో 1896 ఏప్రిల్ 6 నుంచి 15 వరకు జరిగాయి క్రీడాస్థలాలు ఇవి

1900 వాం ఎ
1904 సెయింట్ లూయిస్
1908 లండన్
1912 స్టాక్‌హోమ్
1920 అంట్‌వెర్ప్
1924 పారిస్
1928 అమ్‌స్టర్‌డామ్
1932 లాస్ ఏంజిల్స్
1936 బెర్లిన్
1948 లండన్
1952 హెల్సింకీ
1956 మెల్‌బోర్న్
1960 రోమ్
1964 టోక్యో
1968 మెక్సికో సిటీ
1972 మ్యూనిచ్
1976 మాంట్రియల్
1980 మాస్కో
1984 లాస్ ఏంజిల్స్
1988 సియోల్
1992 బార్సిలోనా

# వార్తలు

## అరణ్యేతర ఉపయోగాలకు 15,000 హెక్టార్ల అటవీ భూమి

1980 మరియు 1988 మధ్య రమారమిన ప్రతి సంవత్సరం దాదాపు 15,000 హెక్టార్ల అటవీ భూమి అరణ్యేతర ఉపయోగాలకు మళ్ళించబడుతున్నది

## ప్రపంచంలో అత్యధిక సేద్యపు నేల ఇండియాలోనే

సేద్య యోగ్యమైన 56 మిలియన్ హెక్టార్లతో ఇండియా ప్రపంచంలోనే అత్యధిక సేద్య యోగ్యమైన భూమి కలిగి ఉంది

## ప్రపంచపు కీటకాల బరువు

ప్రపంచంలోని కీటక జనాభా బరువు మానవ జనాభా మొత్తం బరువు కంటే దాదాపు 12 రెట్లు ఎక్కువ

## పోలియో వ్యాధిగ్రస్తులు 7 మిలియన్ శిశువులు

పుష్కలంగా ఉచిత టీకా మందు లభిస్తున్నా ఇండియాలో దాదాపు 7 మిలియన్ మంది శిశువులు పోలియో వల్ల శాశ్వత వికలాంగులవుతున్నారు

## సంఘంలో 20 శాతం నుంచి వచ్చినవారు

ఇండియాలో 80 శాతానికి పైగా పాఠశాల, కళాశాలల చదువు ముగించుకునే వారు - సంఘం యొక్క అత్యధిక శ్రేణిలోని 20 శాతం నుంచి వచ్చినవారే సంఘంలోని మిగిలిన 80 శాతం ప్రత్యక్ష, పరోక్ష పన్నులు చెల్లిస్తూ అధిక భారం మోస్తున్నవారు

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

## నల్ల మిరియాల ఉత్పత్తి కేరళకు అగ్రస్థానం

నల్ల మిరియాల ఉత్పత్తిలో కేరళ అగ్రస్థానంలో ఉంది ఇండియాలో ఉత్పత్తి అయ్యే నల్ల మిరియాల్లో 95 శాతం పైగా కేరళ సమకూరుస్తుంది మిరపకాయల ఉత్పత్తిలో తమిళనాడు పెద్ద ఉత్పత్తిదారుగా నిలుస్తుంది

## ఉత్పాదకతలేని అటవీ ప్రాంతం

ఇండియాలో ప్రతి సంవత్సరం దాదాపు 1 5 మిలియన్ హెక్టార్ల అటవీ ప్రాంతం ధ్వంసమౌతున్నది 1/3వ వంతు అటవీ ప్రాంతం ఉత్పాదకతలేనిదిగా వాస్తవంగా హీన స్థితికి వచ్చింది

## ఇండియాలో ఐదు పరమాణుశక్తి కర్మాగారాలు

అణువిద్యుత్ శాఖ ఇంతవరకు ఇండియాలో ఐదు పరమాణుశక్తి కర్మాగారాలను నెలకొల్పింది

## పరావర్తనం

*ప్రతి మానవుడు ప్రవీణుడు కావలసిన ఒక కళ ఉన్నది - అదే పరావర్తన కళ నీవు ఆలోచనలేని మనిషివే అయితే, అసలు ఏ ప్రయోజనం కోసం నీవు మనిషిగా ఉంటావు?*

శామ్యూల్ టైలర్ కాలరిడ్జ్

"అనుభవం ఒకరిది ఆర్భాటం ఇంకొకరిది "

## భూమిలోనుంచి నూనె వెలికి తీయటం

భారీగా మనం ఉపయోగించే నూనె - పెట్రోలియం ఇది అమెరికా మరియు ఆసియా లోని లోతైన బావులనుంచి తోడబడుతున్నది నేలలోకి (సాధారణంగా ఇసుక నేలలు) ఒక ఇనుప గొట్టం చొప్పించి, దానిలోగల రంధ్రం చేసే సూది వంటి వస్తువుతో పరిభ్రమణం కలిగిస్తారు డ్రిల్లింగ్ చేస్తున్న (గొట్టం) ఒత్తిడికి నీరు వెలికి వస్తుంది స్థానభ్రంశం చెందిన ముడి సరుకులు వస్తాయి నూనె లభించే వరకు - ఒక్కొక్కసారి 1500 మీటర్ల లోతు వరకు - డ్రిల్లింగ్ జరుగుతుంది

నూనెతో నిండిన భూగర్భ పొరలకు డ్రిల్ ఒత్తిడి తగలగానే నూనె ఉబికి వస్తుంది డ్రిల్స్, పరికరాలు వగైరాలను విసిరి వేస్తుంది ఒక చిక్కని (సాంద్రతకల) నూనె నిలువ వరుసలలో గాలిలోకి 70 నుంచి 100 మీటర్ల వేగంతో ఉబికి వస్తుంది ఇటువంటి బావులను "ఎగజిమ్మే" బావులని పిలుస్తారు ఇతర బావులనుంచి నూనెను తోడి తీయాలి ఒక్కోసారి ఎగజిమ్మటం నిలిచిపోయినట్లయితే స్టీమ్ పంపుల ద్వారా నూనెను వెలికి తీయటం జరుగుతుంది

ఏదైనా ఒక బావి పతనమయ్యే చిహ్నాలు చూపగానే భారీ ప్రేలుడు సామాన్లతో కూడిన ఒక టార్పెడోను - కేబిల్ చివరనున్న ఎలక్ట్రిక్ స్పార్క్ ద్వారా అంటించి - బావి అడుగున ప్రేల్చి వేస్తారు దీనివల్ల నూనె త్వరితగతిలో ప్రవహిస్తుంది

బావులనుంచి నూనెను పైపు లైన్ల (నూనె గొట్టాలు) ద్వారా - కొన్ని సందర్భాలలో కొన్ని వందల మైళ్ళ పొడవునా - ఒక సముద్ర తీరానికో లేక రైల్వే స్టేషన్‌కో చేరుస్తారు

## ఇండియాలో పెద్ద జింక - సాంబార్

*సాంబార్ - ఇండియాలో పెద్దది, విస్తృతంగా కనిపించే జింక హిమాలయ పర్వత పాదాల నుంచి, పశ్చిమ కనుమలలో ఉన్న దక్షిణ ప్రాంతాలలోని అడవుల్లో ఇది ఎక్కువగా కనిపిస్తుంది పూర్తిగా పెరిగిన జింక 150 సెంటీమీటర్ల ఎత్తు, 300 కేజీల బరువు ఉంటుంది ఆడ జింకలు చిన్నవిగా ఉంటాయి ముతక, బిరుసైన బొచ్చుతో ఉండే గోధుమ వర్ణంకల జింకలు వయస్సుతోపాటు నల్ల రంగులోకి మారతాయి*




*జింక కొమ్ము పూర్తి పరిమాణానికి చేరేందుకు నాలుగేళ్ళు పడుతుంది ఒకసారి పూర్తిగా పెరిగితే, ఇవి ప్రతి సంవత్సరం పడిపోతాయి చలికాలంలో శిశు ఉత్పత్తి జరిగే సమయంలో ఇవి తిరిగి పెరుగుతాయి*

*జింకలు సామాన్యంగా ఒంటరిగానే ఉంటాయి జత కలిసే ఋతువులో సహచరిని కలుస్తాయి రాత్రివేళలో మాత్రమే సంచరించే జింకలు ఇప్పుడు ఉత్తమ రక్షణ కలిగినందువల్ల కాబోలు జాతీయ పార్కుల్లో పగటివేళల్లో కూడా తరచుగా విహరిస్తున్నాయి*

*— 'హార్న్‌బిల్' సౌజన్యంతో*

"మతిలేని మాట శృతిలేని పాట"

# మలబద్ధ నివారణకు ప్రకృతి వైద్యం

హెచ్ కె బఖ్రూ

జీర్ణకోశంలో సర్వసాధారణంగా జరిగే గందరగోళం - మలబద్ధం పేగులు క్రమబద్ధంగా కదలకపోవటం లేదా అవి కదిలినా పూర్తిగా ఖాళీ కాకపోవటం - ఈ పరిస్థితికి కారణం అనేక వ్యాధులకు ప్రధాన కారణం - మలబద్ధం




పదేపదే పోకుండా ఉండటం, క్రమరహితం, గట్టిపడిన మలం తొలగించటంలో కష్టం - మలబద్ధానికి అత్యంత సాదారణమైన లక్షణాలు ఇతర లక్షణాలలో - నాలుక పూత, అసహ్యమైన శ్వాస (ఊపిరి), ఆకలి లేకపోవటం, తలనొప్పి, తల తిరగటం, కళ్ళ క్రింద నల్లని వలయాలు ఏర్పడటం, విషాదం, వికారం, ముఖంపై మొటిమలు, నోటిలో పుండ్లు, ఉదరం (పొత్తి కడుపు) నిరంతరం నిండుగా ఉండటం, ఆమ్లం (పుల్లదనం), గుండెల్లో మంట, మరియు నిద్రలేమి (నిద్రపట్టకపోవటం) ఉన్నాయి

శుద్ధి చేసిన, విలువైన ఆహార పదార్థాలు తీసుకోవటం, విటమిన్లు, ఖనిజాలు లేకపోవటం, చాలినంత నీటిని త్రాగకపోవటం, అదిక పరిమాణాల్లో మాంసం భుజించటం, గాఢమైన (స్ట్రాంగ్) టీనీ, కాఫీనీ ఎక్కువగా త్రాగటం, చాలినంతగా నమలకపోవటం, అదికంగా తినటం మరియు ఆహార పదార్థాల సంయోజనలో పొరపాట్లు చేయటం, తినటం, త్రాగటంలో క్రమబద్ధంలేని అలవాట్లు కలిగి ఉండటం - ఇవన్నీ పేగులు అల్పంగా పని చేసేందుకు దోహదం చేస్తాయి మలాన్ని శుద్ధి చేసుకునే విషయంలో క్రమంలేని, పొరపాటైన పద్ధతులు, బేది మందుల్ని తరచుగా ఉపయోగించటం, ఎల్లప్పుడు వదలకుండా ఒకే చోట కూర్చునే పద్ధతి వల్ల ఉదర కండరాల్లో బలహీనత ఏర్పడటం, శారీరక చురుకుదనం లేకపోవటం, మరియు ఉద్రేకపూరితమైన ఒత్తిడులు, ప్రయాస వంటివి - ఇతర కారణాల్లో చేర్చబడ్డాయి

మలబద్ధానికి స్వస్థత చేకూర్చేందుకు తోడ్పడే అత్యంత ప్రధానమైన అంశం ఏదంటే సహజమైన, సులభమైన తిండి (పథ్యం) దీనిలో పూర్తిగా తృణదాన్యాలు, తవుడు, తేనె, మొలాసెస్ (బెల్లపు మడ్డి) మరియు కాయ దాన్యాలు, ఆకుపచ్చని తాజా కూరగాయలు - ప్రత్యేకించి - Spinach, ఫ్రెంచ్ చిక్కుళ్ళు, టొమాటోలు, ఒక విధమైన కూరాకులు (Lettuce), ఉల్లి, కాబేజి, కాలిఫ్లవర్, ఒక దినుసు తోటకూర (Celery), ఒక దినుసు దుంపలు (Turnips), గుమ్మడికాయలు, బటాణీలు, మరియు కారట్స్ తాజాపండ్లు - ముఖ్యంగా - బేరిపండ్లు (Pears), ద్రాక్షపండ్లు, అత్తిపండ్లు, బొప్పాయిలు, మామిడి పండ్లు, జామపండ్లు, మరియు నారింజపండ్లు, ఎండిన పండ్లైన - అత్తిపండ్లు, ఎండు ద్రాక్షలు, జల్దరు పండ్లు (apricots) మరియు ఈతపండ్లు మరియు వెన్న, నెయ్యి, మీగడ రూపంలో ఉన్న పాల పదార్థాలు కూడా తీసుకోవాలి

---

'ప్రతి వస్తువు మరియు శక్తిలోని ప్రతి రేణువులోనూ నిండి ఉన్నట్టి - ఒకరి ఆదేశాలవల్లనే గాలి వీస్తుంది, నిప్పు మండుతుంది, మేఘాలు వర్షిస్తాయి మరియు మృత్యువు భూమి మీద పిలిలాగా నడుస్తుంది

ఆహారం సక్రమంగా నమిలి మ్రింగాలి కొందరపడుతూ ఆహారం తీసుకోవటం, ఆసాధారణ సమయాల్లో ఆహారం తీసుకోవటం విడిచిపెట్టాలి క్రమబద్ధంగా నీరు త్రాగటం మలబద్ధానికి ఎంతో లాభదాయకంగా ఉంటుంది ఇది వ్యవస్థను పరిశుభ్ర పరుస్తుంది రక్తాన్ని పలచన చేస్తుంది, విష పదార్థాలను కడిగి వేస్తుంది

మలబద్ధానికి సంబంధించిన సాధారణ కేసుల్లో - చికిత్స ప్రారంభించేందుకు ముందు దాదాపు ఐదు రోజుల పాటు ప్రత్యేకంగా పండ్ల ఆహారం తీసుకోవటం ఉత్తమ మార్గం దీర్ఘకాలంగా ఉన్న కేసుల విషయంలో రోగి నాలుగు లేక ఐదురోజుల పాటు స్వల్పకాలపు ఉపవాసం ఉండాలి దానివల్ల పేగుల్లో క్రుళ్ళుకు పోయిన పదార్థాల్ని వెలికినెట్టటం, జీవ పదార్థాలు ఉత్పత్తి చేసే విషపదార్థా (toxin)లను తొలగించటం, రక్తప్రవాహాన్ని పరిశుభ్ర పర్చటం జరుగుతుంది ఉపవాస సమయంలో బల హీనులైన రోగులు నారింజ రసం తీసుకో వచ్చు అన్ని పండ్ల ఆహారం లేదా అల్పకాలపు ఉపవాసం తరువాత, సందర్భాన్ని బట్టి - పూర్తి తృణ ధాన్యాలు, ముడి ఆహార పదార్థాలు, పక్వమైన పండ్లతో సమకూర్చిన ఒక సంతులిత ఆహారం రోగికి క్రమేణా ఇవ్వటం ప్రారంభించాలి చికిత్స మొదలైన తరువాత కొన్నాళ్ళవరకు వేడినీటి ఎనిమాతో రోగి పేగులు శుభ్రపర్చాలి

ప్రతి రోజు ఉదయం తీసుకునే చన్నీటి మర్దనపు) స్నానం మలబద్ధ నివారణకు తోడ్పడుతుంది విశ్రాంతికోసం పక్క మీదికి చాలేముందు వేడినీటితోనూ, చన్నీటితోనూ ఒక దాని తరువాత ఒకటిగా చేసే తుంటి స్నానం కూడా ఉపయోగకరమే తాజా గాలి, వెలుపలి (outdoor) ఆటలు, నడక, ఈత, తోటపని మరియు ఇతర వ్యాయామాలు మలబద్ధం అరికట్టేందుకు తోడ్పడతాయి ఈ పరిస్థితిని నయం చేసేందుకు ఉపయోగపడే యోగాసనాలు ఇవి భుజంగాసనం, శలభాసనం, యోగ ముద్రాసనం, దనురాసనం, హలాసనం మరియు పశ్చిమోత్తాసనం

## 1500 మైళ్ళు విస్తరించిన గోడ



*తన సామ్రాజ్యం పశ్చిమ పర్వతాల నుంచి సముద్రం వరకూ ఉత్తరపు సరిహద్దు పొడవునా ఒక గోడను చైనా చక్రవర్తి - ఛిన్ షిహ్ హుయాంగ్ టీ నిర్మించాడు 214 బిసిలో ఈ నిర్మాణం ప్రారంభమైంది చైనా ఏకీకరణకు పూర్వం భూస్వామ్య రాష్ట్రాలు ఒక దానితో మరొకటి అనుసంధానం చేసుకునేందుకు వినియోగించిన చిన్న సైజు సరిహద్దు గోడలను ఈ చైనా గోడ నిర్మాణంలో ఉపయోగించారు ప్రతి 100 గజాలకు ఒక కావలా గోపురం కలిగిన ఈ గోడ 1500 మైళ్ళకు పైగా విస్తరించి ఉంటుంది ఇది హూసియుంగ్ నూ, లేక "ఉత్తరాది అనాగరికుల"ను వెలుపలే ఉంచగలిగింది రమారమి 20 అడుగుల ఎత్తుతో ఉన్న ఈ గోడ ఇటుకలు లేదా నల్లరాయి,*

"మానవుడు ఆనందంగా జీవించాలంటే అతనికి రెండు కావాలి మొదటిది ప్రేమ రెండవది జ్ఞానం" — బెర్ట్రండ్ రస్సెల్

# సరసోక్తులు

## నిశ్శబ్దపాఠం

ఈ రోజుల్లో పిల్లలకు బాల్యంలోనే క్రమశిక్షణ అలవర్చటం కష్టంగా ఉంది దీనికి ఒక కారణం ఏమంటే వాళ్ళకి సంభాషణ నేర్పిన వెంటనే నీవు "నిశ్శబ్దంగా ఉండాలని" కూడా బోధన ప్రారంభించవలసి రావటం



## కష్టకాలం

రోజు రోజుకూ ధరలు పెరిగిపోతున్న ఈ రోజుల్లో కష్ట (వానా) కాలంలో ఉపయోగించేందుకు నీవు దాచుకోగలిగిన ఒకే ఒక వస్తువు - గొడుగు

## భర్త

నిన్ను కష్టాల్లో ఆదుకునేవాడే భర్త అయితే నీవు అతణ్ణి వివాహం చేసుకోకపోయినట్లయితే వాటిని అనుభవించేదానివే కాదు!

## మానవమేథ

ప్రపంచంలో విలువైనది, అన్వేషించలేని ప్రాంతం - మానవ మేథ మేథ కూడా భూమివలెనే మనం నాటిన మొక్క - మంచిదైనా, చెడ్డదైనా - లక్ష్యపెట్టదు దేనిని నాటితే దాన్నే తిరిగి ఇస్తుంది

## ఆకలి భేదం

ప్రతిరాత్రి భూమిపైనకల 3 బిలియన్ ప్రజలు ఆకలితో నిద్రిస్తారు అయితే 4 బిలియన్ ప్రజలు - ప్రోత్సాహం మరియు గుర్తింపు - అనే మాటకోసం - ఆకలి చెంది - ప్రతిరాత్రి నిద్రిస్తారు

— కావెట్ రాబర్

## 40 ఏళ్ళ తరువాత

నలభై సంవత్సరాల వయస్సు తరువాత చాలామంది వ్యక్తులు - సద్గుణం, సత్ప్రవర్తనం - అని భావించేది కేవలం బలాన్నీ, శక్తినీ పోగొట్టుకోవటాన్నే

— వోల్టేర్

## పాఠశాలల్లో సౌర ఇంధన కర్మాగారాలు

*పాఠశాలల్లో సౌర ఇంధనపు కర్మాగారాలను చైనీయులు నెలకొల్పుతున్నారు ఉత్తర చైనాలో - సూర్యకాంతి ఉన్నా చలిగా ఉండే ప్రదేశం కనుక అక్కడి కొత్త పాఠశాల భవనాలలో సౌర ఇంధనపు కర్మాగారాలను నెలకొల్పుతున్నారు వెలుపలి ఉష్ణోగ్రత మైనస్ 20 డిగ్రీల సెల్షియస్‌కు తగ్గినా, లియాన్ఇంగ్ రాష్ట్రంలోని పాఠశాలల్లో గది ఉష్ణోగ్రత 7 నుంచి 15 డిగ్రీల సెల్షియస్ వరకు ఉంటుంది*

*—'సిఐఐ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"ప్రేమలేని జీవితం ఉప్పువెయ్యని కూరలాంటిది, నీరులేని ఎడారిలాంటిది;

## మేలైన తీర్మానాలు

తమకు కాతా లేకుండా మనుషులు బ్యాంక్ నుంచి సొమ్ము తీసుకునేందుకు వాడే చెక్కులే - మేలైన తీర్మానాలు

— ఆస్కార్‌వైల్డ్

## కలలు - వాస్తవాలు

కలలను వాస్తవికతతో తారుమారు చేయటమే జీవితంలోని శాశ్వతమైన ఆకర్షణ వాస్తవికతకు కలలు లోబడినప్పుడు జీవితంలోకి శాశ్వత ఓటమి వస్తుంది

— జేమ్స్ మిచ్‌నర్

## నిజమైన దాతృత్వం

చేసిన దానం పన్ను మినహాయింపు పొందుతుందా, పొందదా అనే విషయం గురించి - నిజమైన దాతృత్వం లక్ష్యపెట్టదు

## బాధ్యత

తప్పు చేయకుండా పౌరుల్ని కాపాడటం ప్రభుత్వ బాధ్యత కాదు తప్పు చేయకుండా ప్రభుత్వాన్ని రక్షించుకోవటం పౌరుల విధి

## బంధువుల కృతజ్ఞత!

ఒక పిసినారి తన జీవితమంతా డబ్బు చేర్చటం, పలురకాలుగా వృద్ధి చేయటం, తీసివేయటంతో గడుపుతాడు కృతజ్ఞతగల అతని బంధువులు భాగాలు పంచుకుంటారు

## నిష్కపటి

నీ వెనుక కాకుండా నీ దగ్గరే నీ గురించి నిష్కర్షగా చెప్పేవాడే - నిష్కపటమైన మిత్రుడు

## బుద్ధినిబట్టే లోకం

మేధనుబట్టే ప్రపంచం కూడా - కళ్ళజోడు (సులోచనాలు) ధరించిన వ్యక్తి ఆ అద్దాల రంగునిబట్టి ప్రపంచాన్ని చూస్తాడు అదే విధంగా మనం కూడా మన మేధల నిర్మాణం ప్రకారం ప్రపంచాన్ని అనుభవంతో తెలుసుకుంటాము.

— స్వామీ చిన్మయానంద

## పిన్న వయస్సులో అమెరికా అధ్యక్ష పదవి



Teddy Roosevelt

*42వ ఏట అధ్యక్ష పదవి స్వీకరించిన థియొడొర్ రూజ్‌వెల్ట్ అమెరికాలో పిన్న వయస్కుడైన అధ్యక్షుడుగా నమోదయ్యాడు యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన 42 మంది అధ్యక్షులలో కేవలం ఆరుగురే 50 సంవత్సరాలకంటే తక్కువ వయస్సులో అమెరికా అధ్యక్షులయ్యారు 1853లో ఫ్రాంక్లిన్ పియర్స్ (49), 1869లో యులిసెస్ గ్రాంట్ (47), 1885లో గ్రోవర్ క్లీవ్‌లాండ్ (48), 1961లో జె ఎఫ్ కెన్నెడీ (43) మరియు 1993లో బిల్ క్లింటన్ (46) - అధ్యక్షులయ్యారు*

'మరణించిన వానికంటే బ్రతికున్నవాడు ఎంత అధికుడో, నిరక్ష రాశ్యునికంటే విద్యావంతుడు అంత అధికుడు " — అ౯

# దేశయశస్సులో నాకు హక్కు ఉంది

భవిష్యత్ నిర్మాణానికి మనం అఖిల బారత అవగాహన పెంపొందించుకోవటం అత్యంత ప్రధానమైన విషయం రాష్ట్రాభివృద్ధి అనే సంకుచిత దృష్టి ఆ రాష్ట్రానికీ, ఇండియాకు ఏ విధంగానూ ఉపకరించదు నేను ఉత్తర ప్రదేశ్ నుంచి వచ్చి ఉండవచ్చు, మా పూర్వీకులు కాశ్మీర్ నుంచి వచ్చి ఉండవచ్చు కానీ నేను భారతీయుణ్ణిగానే బావించుకుంటాను



Nehru

కన్యాకుమారి నుండి హిమాలయాల వరకు ఉన్న భారతదేశం యొక్క సత్కర్మలను, సంప్రదాయాలను నేను జన్మసిద్ధమైన వార సత్వ హక్కుగా పొందానని బావించుకుంటాను

తనకే సొంతమైన, గర్వకారణం కల సంప్ర దాయం-ఇండియాలోని ఏ రాష్ట్రంలో లేకుండా ఉంది? దక్షిణాదికి వెళ్ళండి, తమిళనాడుకు వెళ్ళండి వారికి ఒక గొప్ప బాష, ఘనత కల సంప్రదాయాలు ఉన్నాయి - సైనిక పరమైనవీ, ఇతరమైనవీ ఆంధ్రాకు వెళ్ళండి ప్రాచీన ఆంధ్ర సామ్రాజ్యాల గురించి వారు మీకు చెబుతారు మలయాళీల వద్దకు వెళ్ళండి, కన్నడిగుల దగ్గరకు వెళ్ళండి మీరు ఉత్తరానికి వెళ్ళినా, దక్షిణానికి వెళ్ళినా, తూర్పుకు, పడమటి ప్రాంతానికి వెళ్లినా - ప్రతి ప్రదేశం, బారతదేశంలోని ప్రతిబాగం - గొప్ప సంప్రదాయాలు, గతానికి చెందిన గొప్ప గాథలు, గొప్ప సంస్కృతి, సైనికపరమైన యశస్సు కలిగినవిగా ఉంటాయి

వంశ పారంపర్యంగా వచ్చిన ఈ ఆస్తిని నేను వారసత్వంగా పొందాను నేను అలహాబాద్‌లో జన్మించినప్పటికీ, అదొక ప్రాచీన నగరమైనప్పటికీ నేను అలహాబాద్ నగరానికే పరిమితమై ఉంటానని మీరు బావిస్తున్నారా? ఆంధ్ర, తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాత్ మరియు బారతదేశంలోని ప్రతి ఇతర ప్రాంతంలోని యశస్సులో నాకు కూడా హక్కు ఉందని నేను వాదిస్తాను

—జవహర్ లాల్ నెహ్రూ

## నష్ట పరిహారం ఇముడ్చుకున్న జీవిత భీమా

*వారి కోసం నిర్ణయించిన మందుల వల్ల ప్రమాదవశాత్తూ హాని జరిగినప్పుడు రోగులకు నష్ట పరిహారం చెల్లించే జీవిత భీమా పథకం ప్రపంచంలో మొట్టమొదటి సారి ప్రవేశపెట్టిన దేశం - స్వీడన్ స్వీడన్‌లోని అన్ని ఔషద తయారీ సంస్థలు, తమ వ్యాపారపు అమ్మకపు మొత్తానికి దామాషా నిష్పత్తిలో ఈ ఇన్సూరెన్స్ (ఫండ్) నిధికి ధనం సమకూరుస్తున్నాయి*

# స్వామి వివేకానందుని చికాగో ప్రసంగం

[1893 సెప్టెంబర్ 11న చికాగోలో జరిగిన ప్రపంచ సర్వమత సమ్మేళనంలో స్వామీ వివేకానందుని ప్రసిద్ధ ప్రసంగ పాఠాన్ని ఈ శతజయంతి సంవత్సరంలో పునర్ముద్రించటం మేము అత్యంత ఆనందదాయకంగా భావిస్తున్నాము.

— ఎడిటర్]



Vivekananda

అమెరికా సోదర సోదరీమణులారా,

మీరు మాకు అందించిన ఔదార్యవంతమైన, హృదయపూర్వకమైన స్వాగతానికి ప్రత్యుత్తరం ఇచ్చేందుకు మీముందుకు రావటం - నా మనస్సులో అనిర్వచనీయమైన ఆనందం కలిగిస్తున్నది ప్రపంచంలోని అత్యంత ప్రాచీన సాధువుల (సన్యాసుల) శ్రేణి తరఫున నేను మీకు కృతజ్ఞతాభివందనాలు తెలుపుతున్నాను. మతాల మాతృమూర్తి పక్షాన నేను కృతజ్ఞతలు తెలుపుతున్నాను మరియు కోట్లాదిగా ఉన్న అన్ని తెగల, తరగతుల హిందూ ప్రజానీకం పేరిట మీకు నేను అభివందనాలు తెలుపుతున్నాను.

తూర్పుదిశ నుండి వచ్చిన ప్రతినిధులను ఉద్దేశించి - ఈ సుదూర తీరాల నుండి ఏతెంచిన మానవులు సహనశక్తి కలవారుగా, వివిధ ప్రదేశాలకు చెందిన వీరు సహనానికి నిజమైన హక్కుదారులుగా తమ ప్రసంగాలలో చెప్పిన కొంతమంది ఉపన్యాసకులకు నా కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటున్నాను సహనాన్నీ, సర్వతోముఖమైన సమ్మతినీ ప్రపంచానికి బోధించిన మతానికి చెందిన వాడినని నేను గర్వపడుతున్నాను విశ్వజనీన సహనంలో విశ్వాసమే కాకుండా, అన్ని మతాలు సత్యమైనవేనని కూడా మేము అంగీకరిస్తున్నాము 'బహిష్కారము' (వెలి) అనే మాటను అనువదించ లేని పవిత్రమైన భాష - సంస్కృతానికి సంబంధించిన మతానికి చెందినవాడినని నేను మీకు సగర్వంగా చెబుతున్నాను శరణార్థులకు ఆశ్రయం కల్పించి, ప్రపంచంలోని అన్ని దేశాల, అన్ని మతాల చేత పీడించి బాధించబడిన వారికి - ఆశ్రయం ఇచ్చిన దేశానికి చెందిన వాడినని నేను గర్వపడుతున్నాను రోమన్ క్రూరపాలనలో తమ పవిత్ర దేవాలయం ధ్వంసం కాగా అదే సంవత్సరంలో దక్షిణ భారతదేశానికి - శేష శరణార్థులుగా వచ్చిన స్వచ్ఛమైన మిగిలిన ఇజ్రాయిలీలను ఆప్తులుగా

## 1,680 గ్రంథాలయాల నిర్మాణానికి 56 మిలియన్ డాలర్ల వ్యయం

*కోటీశ్వరుడు, వదాన్యుడు, ఉక్కు వాణిజ్యవేత్త అయిన ఆండ్రూ కార్నీజీ ముప్పై సంవత్సరాలలో 56 మిలియన్ డాలర్లకు పైగా వ్యయం చేసి యునైటెడ్ స్టేట్స్‌లో 1,680 గ్రంథాలయాలు స్థాపించాడు*

"సరైన అవగాహనకు - క్రోధం మరియు అసహనం రెండు శత్రువులు"

భావించి హృదయంలో చేర్చుకున్నామని నేను సగర్వంగా తెలియజేస్తున్నాను బ్రహ్మాండమైన జొరాస్ట్రియన్ జాతికి చెందిన శేషించిన వారికి ఆశ్రయం కలిగించి - వారిని ఇప్పటికీ - శ్రద్ధగా పోషిస్తున్న మతానికి చెందిన వాడినని నేను సగర్వంగా చెబుతున్నాను "సోదరులారా! మానవకోటి ప్రతిదినం పునరుచ్చరిస్తున్న ఒక ధ్యాన శ్లోకం - నా బాల్య దశనుంచి నేను పదే పదే ఉచ్చరిస్తున్న ఒక శ్లోకం నుంచి కొన్ని పంక్తులను నేను ఉదహరిస్తాను "వివిధ స్థలాలలో తమ మూలాధారాలు కలిగిన వివిధ నదీ ప్రవాహాలు తమ జలాలను సముద్రంలో కలిపినట్లుగా - ఓదేవా! వివిధ ధోరణులుకల మానవులు - వివిధ విధాలుగా గోచరించేవారు కపటులు మరియు నిష్కపటులు - అందరినీ - ఒకే విధంగా - నీవద్దకు చేర్చుకో"

ఇంతకు ముందెన్నడూ జరగని ఈ గంభీరమైన, మహనీయమైన సమావేశాలలో ఒకటైన ప్రస్తుత సమావేశం - దానికదే - ఒక న్యాయ నిరూపణం గీతలో ప్రబోధించిన ఒక అద్భుతమైన సిద్ధాంతం ప్రపంచానికి తెలియపర్చే ఒక ప్రకటనగా నిలుస్తుంది "నావద్దకు ఎవరు వచ్చినా, ఏ రూపంలో వచ్చినా, నేను వారిని చేర్చుకుంటాను మానవులంతా కాలి త్రోవల వెంట ప్రయాసపడుతున్నారు ఆ త్రోవలు చివరకు వారిని నావద్దకే చేరుస్తాయి" ఈ సుందరమైన పృథ్విని - మతభేదం, సంకుచిత దురభిమానం (మూఢ విశ్వాసం), మరియు దాని భయంకరమైన సంతతి - మూఢభక్తి - చాలాకాలంగా స్వాధీనపర్చుకుని ఉన్నాయి ఇవి ఈ పుడమిని క్రౌర్యంతో నింపాయి తరచుగా మానవరక్తంతో తడిపాయి నాగరికతలను ధ్వంసం చేశాయి సమస్త జాతులను నిరాశలోకి నెట్టాయి ఈ భయంకరమైన పిశాచాలు చుట్టుకోనట్లయితే, మానవ సమాజం - ఈ సమయానికే - ఇప్పటికన్నా అత్యంత అభివృద్ధిలో ఉండేది అయితే ఆ కాలం కూడా వచ్చింది ఈ సమ్మేళనం గౌరవార్థం నేటి ఉదయం మ్రోగిన గంట మూఢ భక్తికీ, కత్తి లేదా కలానికి సంబంధించిన అన్ని పీడనలకూ, ఒకే గమ్యానికి చేరుకునే మానవ ప్రాణికోటిలోని ఉదారబుద్ధి లేని అన్ని అభిప్రాయాలకూ మరణ ఘంటానాదంగా ఋజువు చేస్తుంది

# వదిలిపెట్టవద్దు




ఫ్రెంచ్ శాస్త్రజ్ఞుడు లూయీ పాశ్చర్ సెరిబ్రల్ థ్రాంబోసిస్‌కు గురై అతని పరిస్థితి విషమించినప్పుడు ప్రభుత్వం అతనికోసం నిర్మిస్తున్న పరిశోదనశాల నిర్మాణాన్ని నిలిపివేసింది దీన్ని పాశ్చర్ గమనించి త్వరితంగా పతన దశకు చేరుకున్నాడు అతని మిత్రులు 3వ నెపోలియన్ చక్రవర్తికి విజ్ఞప్తి చేయగా నిర్మాణం కొనసాగించమని ఉత్తర్వు జారీ చేశాడు అంతట పాశ్చర్ కోలుకున్నాడు కొత్త పరిశోదనశాలలో రాబిస్ వ్యాదిని జయించాడు, మరో అరడజను ఇతర వ్యాధులపై విజయం సాధించాడు

"జీవితం - ఒక సన్నెకల్లు (తిరుగలి) అది నిన్ను పిండి క్రింద చేసి క్రిందికి తోస్తుంది లేదా మెరుగుపెట్టి పైకి ఎగబ్రాకిస్తుంది

డా బి కర్దాషెంకో

ట్వీజర్స్ (గట్టిగా పట్టుకునే పరికరాలు)తో మొటిమలను గిల్లివేసి, వాటిపైన అయొడిన్ చిలకరించి, డాక్టర్ తన మొటిమల్ని పోగొట్టాడని స్నేహితురాలు ఆ అమ్మాయితో చెప్పింది ఆ అమ్మాయి స్వయంగా ప్రయత్నించి మొటిమల్ని పోగొట్టుకోలేకపోయింది దానికి బదులుగా అక్కడ ఒక బాధాకరమైన వాపు (గడ్డ) ఏర్పడింది



మధ్యలో - పసుపు రంగు కల - అంటువ్యాధి కలిగించే ఎన్నో పొక్కులతో కూడిన ఒక పెద్ద సైజు చెర్రీపండు వలే ఆ వాపు తయారయింది ఆ అమ్మాయి చీము (రసి)ని పిండి బయటికి లాగేందుకు ప్రయత్నించింది దానివల్ల మొటిమ మరింత పెద్దదై రక్తవర్ణానికి మారింది ఆమె శరీర ఉష్ణోగ్రత 39 5 డిగ్రీల సెల్షియస్‌కు పెరిగిపోయింది ఆమె ఆస్పత్రి పాలై, అత్యవసర శస్త్ర చికిత్సకులోనై 'విషపు రక్తం' విరుగుడు కోసం దీర్ఘకాలం చికిత్స చేయించుకోవలసి వచ్చింది ఆమె స్నేహితు రాలికి ఆమెకు వచ్చిన 'రకం మొటిమ' రాలేదు

ఒక ఆరోగ్యవంతుని చర్మంపైన రసిని ఉత్పత్తి చేసే అనేక మిలియన్ల సూక్ష్మ జీవులు ఉన్నాయి అవి గమనించదగినట్టివి కావు సాధారణంగా ఏవిధమైన ఇబ్బందినీ కలిగించవు కానీ చర్మపు ఉష్ణోగ్రతలో తీవ్రమైన పతనం ఏర్పడినా, ఒక కోతగానీ, గాయం కానీ ఏర్పడినా, మినరల్ ఆయిల్, కిరొసిన్ లేదా టర్పెన్‌టైన్ చర్మం మీద పడినా, సాధారణ శరీరస్థాయిలో మార్పు జరిగినా, ఈ హాని కలిగించని సహచరులు తమ పని ప్రారంభిస్తాయి అప్పుడు ఇబ్బంది మొదలవుతుంది

మొటిమలు వచ్చేందుకు కారణాలివి అతి తక్కువగా ఉన్న వ్యక్తిగత పరిశుభ్రత, సక్రమంగా

## ప్రతిరోజు 40 మిలియన్ మందికి జాబుల బట్వాడా



*తపాలాశాఖ ప్రతి పనిరోజూ 40 మిలియన్ మందికి జాబులను బట్వాడా చేస్తుంది 482, 684 తపాలా పెట్టెల నుంచి, తపాలా కార్యాలయాల నుంచి మరియు బారీ తపాలా వాడకం దార్ల నుంచి ఉత్తరాల సేకరణ చేస్తున్నది*

"ప్రజా వినోదానికి నేను గొప్ప మిత్రుణ్ణి, ఎందుకంటే ఇవి ప్రజల్ని నుంచి తపిసాయి" —శామ్యూల్ జాన్సన్

లేని చర్మ రక్షణ, సరిపోని వస్త్రధారణ, బిగుతుగా ఉండే కాలర్స్, అండర్‌వేర్స్ వీటికి మొటిమలతో సంబంధం కలగగానే - మరో ప్రాంతంలో కూడా అవి వ్యాపించేందుకు తోడ్పడతాయి రేజర్ల యొక్క చిఅచిఅలాడించే గుణం, బారీ క్రీములు, ఆయింట్‌మెంట్స్ (తైలాల) అత్యధిక, అజాగ్రత్త వాడకం కూడా మొటిమల వృద్ధికి బాగా తోడ్పడే రెండు కారణాలు

రసిని ఉత్పత్తి చేసే సూక్ష్మక్రిములు క్రొవ్వును తీసుకుపోయే గొట్టాలలోకి మరియు జుట్టు పైనున్న లఘు రంధ్రాలలోకి దూరి దీర్ఘకాలిక కలతలు కలిగిస్తాయి ముఖం మీద మొటిమలకు స్వంత వైద్యం వల్ల తీవ్ర పరిణామాలు ఏర్పడతాయి శిరస్సులోని రక్తనాళాలలో వచ్చే అంటువ్యాధి మొత్తం శరీర క్రమాన్నే విష పూరితం చేస్తుంది

ఒక మొటిమను ఏ పరిస్థితుల్లోనూ, ఒత్తిడి ద్వారా పిండటం కానీ, చికిత్స చేయటం కానీ జరపకూడదు దీనికి బదులుగా బ్రిలియంట్ గ్రీన్ సొల్యూషన్‌తో మెల్లగా తట్టాలి లేదా రోజుకు ఒకటి లేదా రెండుసార్లు 2 లేక 5 శాతం నీటిలో కరగించిన ఐయొడిన్‌తో, చుట్టూ ఉన్న ఆరోగ్యవంతమైన చర్మాన్ని తుడవాలి ఉడికొలోన్ లేదా ఏదైనా మందు కలిపిన ద్రావకంతో నైనా తుడవాలి ముఖక్షౌరం చేసుకునేటప్పుడు మొటిమను గోకివేయకూడదు తాత్కాలికంగా ఒక ఎలక్ట్రిక్ షేవర్‌ను ఉపయోగించాలి

రెండు రోజుల్లో మొటిమల చికిత్సకు ప్రతిఫలం కనిపించకపోతే, లేదా కొత్త మొటిమలు ప్రత్యక్షమైతే ఒక స్పెషలిస్ట్ (నిపుణుణ్ణి)ని సంప్రదించవలసి ఉంటుంది గృహ చికిత్సలు కానీ, మొటిమలు ఉన్న స్నేహితుల సలహాలు కానీ అమలు చేయటానికి ఎప్పుడూ ప్రయత్నించవద్దు

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్**-1 (డి) ఫిజీ, 2 (ఎ)టెన్నిస్ క్రీడా కారిణి, 3 (డి)విభూతి, 4 (సి) చైనా, 5 (ఎ) 70 శాతం, 6 (ఎ) బ్రిటన్, 7 (సి) పర్వత శిఖరం, 8 (డి)గోధుమవర్ణం

**మాటలమహిమ** - 1 (ఎ) వేదము, (బి) చెవి, (సి)వినికి, (డి)సుద్ధి, 2 (ఎ)తెలుపు (బి) గవ్వ (సి) కైలాస పర్వతము, (డి) సీసము; 3 (ఎ) కొలువుకూటము, (బి) మృగము, (సి) సమూహము, (డి) జూదము, 4 (ఎ) ఇసుకదిబ్బ, (బి) ఇసుకనేల, 5 (ఎ) కుశల ప్రశ్నము, (బి) సుఖము తోడిరాక, (డి) వృత్త విశేషము, 6 (ఎ) అగ్నిశిఖ, (బి) మంట, (సి) సూర్యకిరణము, (డి) ఆయుధము, 7 (ఎ)మనస్సు, (బి)గుండెకాయ, (సి)బొమ్మ, 8 (ఎ) అహో రాత్రము, (బి)రాశ్యర్థము/ లగ్నభేదము, (సి)శాస్త్ర విశేషము, (డి)రేఖా భేదము

**తెలివికి పరీక్ష**-1 టయలిన్, 2 ఆస్టిరాయిడ్స్, 3 టోనీ మారిసన్, 4 బేనజీర్ భుట్టో, పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ, 5 "ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, బగవద్గీత"- వీటిని "ప్రస్థాన త్రయం" అంటారు, 6 కీ శే ద్వారం వెంకట స్వామి నాయుడు- (ఫిడేల్ వాద్య నిపుణుడు)

## వివేకం లేని జీవితం

*నీవు పశ్చాత్తాప పడవలసిన పని చేయటం వల్ల ప్రయోజనం లేదు - దుఃఖిస్తూ ఫలం అనుభవించాలి వివేకం లేని బ్రతుకు విత్తటం లేకుండా దున్నటం వంటిది*

'అంతరాత్మకు విరుద్ధంగా ఏహేతువును కూడా చిత్తశుద్ధికల వ్యక్తి ఎంతమాత్రం వినడు!
—హెరామ్

# గజ శీతగాళ్ళు - ధ్రువపు ఎలుగుగొడ్లు

ధ్రువ సంబంధమైన ఎలుగుగొడ్లు లేక ఎలుగుబంట్లు ఆర్కిటిక్‌లో కనిపిస్తాయి కానీ ఇవి న్యూఫౌండ్‌లాండ్ వంటి సుదూర దక్షిణ ప్రాంతాలలోకి కూడా వచ్చాయని తెలుస్తున్నది ఇవి శక్తివంతమైన ఈతగాళ్ళు. ఇవి భూమికి 200 మైళ్ళ దూరంలో చురుకుగా ఈదుతూ కనిపిసాయి



Polar bear

ధ్రువపు ఎలుగుగొడ్లు 11 అడుగుల మేరకు పొడవైనవిగా ఉంటాయి ఒక సరాసరి మగఎలుగు గొడ్డు 900 పౌండ్లు బరువు ఉంటుంది ఒక సాధారణ ఆడ ఎలుగుగొడ్డు 500 పౌండ్ల బరువు ఉంటుంది ఈ రెండూ కూడా పసుపు రంగు రేఖలతో తెల్లగా ఉంటాయి ఋతువులను బట్టి ఇవి మారుతూ ఉండవు పెద్దవాటి కంటే చిన్నవి మరింత తెల్లగా ఉంటాయి వీటి దట్టమైన చర్మం మరియు క్రొవ్వుతో బలిసిన గాఢమైన పొరలు చలిగాడ్పుల నుంచి, శీతాకాలం నుంచి వీటిని కాపాడతాయి

వసంత ఋతువు మధ్యలో ధ్రువపు ఎలుగుగొడ్లు జతకూడుతాయి నవంబర్ లేదా డిసెంబర్ మాసాల్లో ఒక మంచుతో కూడిన గుహలో ఒకటి లేదా రెండు చిన్నారి ఎలుగుగొడ్లు జన్మిస్తాయి ఈ చిన్నారులు దాదాపు 2 పౌండ్లు బరువు తూగుతాయి ఇవి కేవలం 10 అంగుళాల పొడవు మాత్రమే ఉంటాయి ఇవి పుట్టినప్పుడు గ్రుడ్డివిగానూ, చెవిటివిగానూ ఉంటాయి కానీ దాదాపు ఒక నెల తరువాత చూడగలుగుతాయి, వినగలుగుతాయి

ధ్రువపు ఎలుగుల ఆహారం - చేపలు, భూమిపైన కల చిన్న ప్రాణులు మరియు కొంత వరకు మొక్కలు ఏప్రిల్, మే మాసాలలో ఈ చిన్న ఎలుగులు తమ తల్లులు - నివాస స్థానం కోసం అన్వేషిస్తుండగా అనుసరిస్తాయి వీటికి 7 లేక 8 మాసాల వయస్సు వచ్చేవరకు తల్లులే పెంచి పోషిస్తాయి

ఒక ధ్రువపు ఎలుగుగొడ్డు గంటకు 25 మైళ్ళ మేరకు పయనించే విదంగా వేగాన్ని అబివృద్ధి చేసుకుంటుంది నిర్జన ప్రదేశాలలో (లేక అడవులలో) ఇవి 20 లేక 30 సంవత్సరాల కాలం జీవిస్తాయి ఇవి సాధారణంగా మానవులపై బడవు

—'యువర్ కైండ్‌నెస్ క్లబ్ లెటర్' సౌజన్యంతో

## చంద్రునిపై జ్వాలా బిలాలకు భారత శాస్త్రవేత్తల పేర్లు

చంద్రుని పైన మిక్కిలి దూరంలో ఉన్న మూడు జ్వాలా బిలాలకు *(craters)* ప్రముఖ భారత శాస్త్రజ్ఞులైన డాక్టర్ సి వి రామన్, డాక్టర్ హోమీ జహంగీర్ బాభా, మేఘనాథ్ సాహాల పేర్లు పెట్టబడ్డాయి

"ఒక శ్రేష్ఠమైన జాతిని [illegible]ంచేందుకు మార్గం - శ్రేష్ఠమైన వ్యక్తుల్ని తయారు చేయటమే"

—ఎం విశ్వేశ్వరయ్య

# మన ఆదిమ వాసులు

## ఖాసీలు

మేఘాలయా (ఈశాన్య భారతం)లోని ఖాసీ కొండలలో నివసించే ఖాసీలు విచిత్రమైన ఆచారాలు మరియు అసమానమైన శాసనాలుకల ఒక మనోరంజకమైన ఆదివాసి తెగవారు



సంవత్సరం పొడుగునా ఇక్కడి వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది ఈ ప్రాంతం ఆకు పచ్చని అరణ్యాలతో, జలపాతాలతో మరియు ఏరులతో సమృద్ధిగా ఉంటుంది ఖాసీల చిన్న కుటీరాలు రోడ్డుకు ప్రక్కగా కానీ లేదా వారి పచ్చని వంట చేల సమీపంలోని, కొండ గుట్టలపైన కానీ నిర్మించబడతాయి

ప్రాచీనకాలంలో ఇండో - చైనా నుంచి భారతదేశపు ఈశాన్య భాగంలోకి అరుదెంచిన ప్రజల యొక్క వారసులు ఖాసీలని నమ్మకం కాంబోడియా మరియు పెగూలలో మాట్లాడే మాన్ - ఖమర్ భాషా కుటుంబానికి చెందినది వీరి భాష

ఖాసీలు ఎక్కువ పొడవుగానూ, బాగా పొట్టిగానూ ఉండరు వారు ఎరుపు రంగు చర్మం కలిగి ఉంటారు

ఖాసీలు వ్యవసాయదారులు వీరు వరి, పొటాటోలు, జొన్నలు, పోకచెక్కలు (వక్కలు), మిరపలు, పండ్లు మరియు కూరగాయలు పండిస్తారు ఈ సమమైన లోయల్లో మంచి నీటి పారుదల సౌకర్యంకల పొలాలలో పని చేసే ఖాసీలు ఎవరికైనా ఎదురౌతారు పురుషులు పొలాల విషయం చూసుకుంటారు స్త్రీలు గృహిణులుగా పని చేస్తూ, చిన్న దుకాణాలు నడుపుతుంటారు. బయటి పనులు నిర్వహిస్తుంటారు. వీరు బియ్యం, జొన్నలు, పండ్లు, పొటాటోలు, పంది మాంసం, చేపలు మొదలైనవి తింటారు వీరు తమలపాకులు ఎక్కువగా తింటారు ఏ సాంఘిక వేడుక కూడా తమలపాకులు, వక్కలు సమర్పించకుండా పూర్తికాదు

ఖాసీ స్త్రీలు ఒక గుడ్డముక్కను ముందు భాగంలో ధరిస్తారు ఒక తలపాగా మరియు కొన్ని సమయాల్లో - భుజాల నుండి కాళ్ళ వరకు సాగిపోయే ఒక ఉన్ని గుడ్డను కట్టుకుంటారు ఖాసీ పురుషులు ధోవతి, చొక్కా ధరిస్తారు తలపై పాగా పెట్టుకుంటారు ఒక్కొక్కసారి వీరు పై అంగీ ధరిస్తారు

## విటమిన్ 'ఏ' మూలాధారంగా కరోటిన్

*ఒక కెనడా వైద్య నివేదిక ప్రకారం గ్రుడ్లలోని విటమిన్ 'ఏ' మరియు కరోటిన్ కలిసి ఉమ్మడిగా మానవ శరీరంలో కాన్సర్ సెల్స్‌ను నిర్మూలించేందుకు తోడ్పడుతాయి నారింజ లేక ఎరుపు పదార్థం - కరోటిన్ విటమిన్ 'ఏ'కు మూలస్థానంగా పని చేస్తుంది గ్రుడ్లు, కారెట్స్, తీపి ఉర్లగడ్డలు మరియు ఆకుపచ్చని (తాజా) కూరగాయలలో బెటా కరోటిన్ దాని సహజస్థితిలో ఉంటుంది*

"మానవ వక్షస్థలంలో ఆశయొక్క ప్రవాహం ఎంత శక్తివంతంగా ఉంటుందంటే మనం ఎంత ఎడారి చేరుకున్నా ఎప్పటికీ తప్పి తీరదు

ఖాసీలు మల్లయుద్ధం, లాంగ్‌జంప్, రాళ్ళు విసరటం, మంకీజంప్, కోడిపందేలు, ఎడ్లపందేలు మరియు విలువిద్యలను ఇష్టపడతారు.



The Nongkrem dance being performed by the Khasis of Meghalaya

వీరు తీగలతో కూడిన ఒక వాద్యాన్ని, ఫ్లూట్ (వేణువు), మరిన్‌దింగ్, పిల్లనగ్రోవి, మీంగ్ మరియు భేరీలను వాయిస్తారు ఇవి వీరి సాధారణ సంగీత వాయిద్యాలు

ఖాసీలలో బాలికే తన జీవిత భాగస్వామిని ఎన్నుకుంటుంది ప్రతి సంవత్సరం నాంగ్ క్రెమ్ పండుగనాడు యువతులు రాణులవలే అలంకరించుకుని, కత్తులు దూసి తిరుగుతూ పైకి ఝుళిపించే యువకులతో కలసి నృత్యం చేస్తారు ఈ నృత్యం పూర్తయిన తర్వాత తను ఎంపిక చేసుకున్న పురుషునకు ప్రతి యువతీ ఒక తాంబూలం సమర్పిస్తుంది ఇద్దరూ కలిసి జీవించేందుకు ఇదే ప్రారంభం ఇద్దరిలో ఏ ఒక్కరు తమలపాకును రెండుగా త్రుంచివేసినా వారు విడిపోయినట్లు అర్థం వివాహం తర్వాత ఖాసీ పురుషుడు అతని భార్య ఇంటికి వెళ్ళి అక్కడే నివసిస్తాడు అతడు ఆమె తల్లి కుటుంబంలో ఒక సభ్యుడవుతాడు పిల్లలు తల్లి పేరును స్వీకరిస్తారు

ఖాసీలు సైనిక నృత్యానికి పేరు పొందారు పండుగ రోజుల్లో వీరు ప్రదర్శించే అభిమాన నృత్యాలు - నాంగ్‌క్రెమ్ నృత్యం మరియు సద్ సుఖ్ మైన్‌సియం (సంతోష హృదయాల నృత్యం) వీరి నృత్య భంగిమలు కఠినంగానూ, దృఢంగా (వంగకుండా)నూ ఉంటాయి అయినప్పటికీ ఇవి లయబద్ధంగా ఉంటాయి నృత్యం చేసేటప్పుడు స్త్రీలు ఎప్పుడూ నేల చూపులు చూస్తుంటే, పురుషులు గెంతుతూ, దూకుతూ వీరి భంగిమలకు అవరోధం కలిగిస్తుంటారు.

## సంస్కృతిలో ముఖ్యభాగం - సంగీతం




*సంగీతానికి మూలం మతం ఇప్పటికీ దీని వ్రేళ్ళు సంగీతంలోనే ఉన్నాయి అందువల్ల సంస్కృతిలో ఒక ఆవశ్యకమైన ముఖ్య భాగంగా ఉంది కేవలం ఇంద్రియాలకు ఆనందం కలిగించే కళ మాత్రమే కాక బాలబాలికల విద్యా బోధనలో ఒక ఆవశ్యక భాగంగా కూడా ఉండాలి నోక్కి చెప్పే నీతి సూత్రాలకంటే ఉత్తమమైన శీలాన్నీ, నడవడినీ తప్పక మలచగల శక్తి స్వర లయ, తాళ శిక్షణవల్ల లభిస్తుంది దైవభక్తి, నైతిక నిష్ఠల - అభివ్యక్తీకరణకు సంగీతం, నృత్యం అత్యంత సహజసిద్ధమైన మాధ్యమాలుగా నిలుస్తాయి*

— రాజాజీ

"మనుషులు వింత జంతువులు - అశ్వపు పిఱికితనం, గాడిద మొండి పట్టుదల మరియు ఒంటె ద్వేషం - వీటి సమ్మేళనం

# రోబట్స్ వినియోగంలో జపాన్ అగ్రస్థానం

ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో పారిశ్రామిక స్వయంచాలక యంత్రాల (robots)ను ఉపయోగిస్తున్నది - జపాన్ పరిశ్రమ జపాన్‌లోని అత్యధిక స్వయంచాలిత కర్మాగారాలలో మనుషులకు బదులు యంత్రాలు (robots) కఠినమైన పనులను నిర్వహిస్తున్నాయి




పారిశ్రామిక రోబట్స్ వాస్తవానికి యునైటెడ్ స్టేట్స్‌లోనే మొట్టమొదటగా అభివృద్ధి చేయబడ్డాయి కానీ రోబట్స్ ఉత్పత్తి మరియు నిర్వహణల్లో జపాన్ ప్రస్తుతం అగ్రస్థానంలో ఉన్నది ఉదాహరణకు జపాన్ ఆటోమొబైల్ ఉత్పత్తిలో తక్కువ ధరలు - రోబట్స్ పెంపుదల ఫలితంగా వచ్చినవే రోబట్స్ ప్రవేశం - ఆటోమొబైల్స్ పరిశ్రమలో విప్లవం తీసుకు వచ్చింది

రోబట్స్ గృహాలలోకి కూడా అడుగు పెట్టాయి జపాన్‌లో నేలను పరిశుభ్రం చేసే ఒక యాంత్రిక రోబట్ అభివృద్ధి చేయబడి, ఆచరణాత్మక ఉపయోగంలోకి ప్రవేశ పెట్టబడింది "ఆటో స్వీపీ" అని పిలువబడే రోబట్ మనుషుల కంటే 10 రెట్లు త్వరితంగా నేలలను, అంతస్తులను చిమ్మి, మెరుగుపెట్టగలుగుతుంది

గుంపులు చేరే ప్రదేశాలు, వ్యాయామ శాలల వంటి విస్తృత స్థలాల కోసం రూపొందించిన, బాటరీతో పని చేసే ఒక - శుభ్రం చేసే - రోబట్ నిమిషానికి 25 మీటర్ల వేగంతో చకచకా తిరుగుతుంది గాస్‌తో పని చేసే ఒక గైరోస్కోప్, సూపర్‌సానిక్ వేవ్ సెన్సార్ మరియు లేజర్ నిర్వహించే దూరపు సెన్సార్ - ఈ రోబట్ తన స్థానాన్ని స్థిరీకరించు కునేందుకు, అడ్డంకుల్ని తొలగించుకునేందుకు, గోడల దూరాన్ని కొలత వేసుకునేందుకు తోడ్పడతాయి అది ఒక వస్తువును తాకగానే, తన క్రియలను నిలిపివేసినట్లు ప్రజలకు తెలియజేస్తూ ఒక హెచ్చరిక గంటను మ్రోగిస్తుంది

రోబట్‌ను అభివృద్ధి చేయటంలో అత్యంత కష్టమైనది - మానవుల చేతలను అభినయించే యంత్రాలను తయారుచేసే మృదువైన సామాగ్రికి రూపు రేఖలు కలిగించటం ఒక గదిలోని నేలను 90 శాతం వరకు రోబట్ పరిశుభ్రం చేస్తుంది కానీ మిగిలిన 10 శాతం - ముఖ్యంగా గోడల అంచులు, మూలలు - మానవులే శుభ్రపర్చవలసి ఉంటుంది ఈ యంత్రాలను తేలికగా, చిన్నవిగా ఉండేటట్లు తయారు చేసి నేల యావత్తూ పరిశుభ్రం చేసే విధంగా రోబట్స్‌ను అభివృద్ధి చేసేందుకు భవిష్యత్ పరిశోధన ప్రాధాన్యమిస్తుంది

— జపాన్ కాలింగ్' సౌజన్యంతో

## అత్యంత ఎత్తు ఎగిరే పక్షులు

*హిమాలయాల్లో 8,200 మీటర్ల ఎత్తున కనిపించే ఆల్పిన్ చౌఫ్ - పక్షులలో అత్యంత ఎత్తు ఎగిరే పక్షులు*

'మానవులంతా సమానులే పుట్టుక కాక సత్ప్రవర్తనవల్ల తేడా ఏర్పడుతుంది''
—వోల్టేర్

# వీరిని గురించి తెలుసుకోండి

సర్ రిచర్డ్ బర్టన్ (1821- 90) బ్రిటిష్ యాత్రికుడు అరేబియా మరియు ఆఫ్రికాలను అన్వేషించాడు జాన్ స్పెక్‌తో కలిసి లేక్ టాంగానియికా కనుగొన్నాడు 50 పుస్తకాలకు పైగా వ్రాశాడు



AGATHA CHRISTIE

అగాథా క్రిష్టీ (1891-1976) ఆంగ్ల భాషలో అపరాధ పరిశోధక కథారచయిత్రి హెర్క్యులీ పోయ్‌రాట్ అనే బెల్జియన్ డిటెక్టివ్‌ను సృష్టించింది ఆమె ప్రదర్శనలలో "విట్‌నెస్ ఫర్ ది ప్రాసిక్యూషన్," "ది మౌస్‌ట్రాప్" కూడా ఉన్నాయి

ఎడ్విన్ పావెల్ హబుల్ (1889 - 1953) అమెరికా ఖగోళ శాస్త్రవేత్త ఆకారాన్ని బట్టి అతడు నక్షత్రవీధి (పాలపుంత)ని వర్గీకరించాడు వాటి వాస్తవమైన గమన వేగాన్ని అంచనా వేశాడు విశ్వం విస్తరిస్తున్నదనే ఆలోచనను ముందుకు తెచ్చాడు

రాస్‌బిహారి ఘోష్ (1845- 1908) స్వదేశీ ఉద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు "భారతీయుల కోసం భారతదేశం అ అనే ఆశయం కోసం నిలబడ్డారు

కెమల్ అటాటర్క్ (1881-1938) టర్కీ సేనానాయకుడు మరియు రాజనీతివేత్త సుల్తాన్‌ను పదవీ భ్రష్టుణ్ణి చేసి 1923 లో రిపబ్లిక్ ఆఫ్ టర్కీ స్థాపించాడు 1923 నుండి 1938 వరకు టర్కీ అధ్యక్షుడుగా పనిచేశాడు

వైను బప్పు బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆస్ట్రోఫిజిక్స్ స్థాపకుడు దేశంలో అనేక ఖగోళ భౌతిక పథకాలను ప్రోత్సాహపర్చారు ఇండియాలోనే పూర్తిగా రూపురేఖలు దిద్దుకుని తయారైన 2 5 మీటర్ల కావలూరు టెలిస్కోప్ దీనిలోనిదే సూర్యునికి 450 మిలియన్ కిలోమీటర్ల దూరంలోని ఎనిమిది కిలోమీటర్ల వ్యాసంకల ఎస్టిరాయిడ్ (నక్షత్రం) కు అతని పేరు పెట్టారు

## భద్రపర్చబడుతున్న మహత్తర

*చికాగో (యు ఎస్ ఏ) యూనివర్శిటీ మరియు మొళి (mozhi) అనే మద్రాసు ప్రధాన స్థానంగా ఉన్న ఒక ఇండియన్ ట్రస్ట్ కలిసి పనిచేసేందుకు సిద్ధపడినందువల్ల కారైకుడి సమీపంలో కొట్టైయూర్ లోని కీర్తిశేషుడు రోజా ముత్తయ్యగారి మహత్తర గ్రంథాలయం ఇండియాలోని మద్రాసులో భద్రపర్చబడి, నిర్వహించబడుతుంది. ఈ గ్రంథాలయంలో - దాదాపు 100,000 అపూర్వ గ్రంథాలు, 1500 జర్నల్స్ మరియు వార్తాపత్రికలు, 5,00,000 తమిళం లోని కాగితపు కత్తిరింపులు (clippings) ఉన్నాయి*

—యుఎన్ఐఎస్'

# మహత్తర ప్రభావం చూపే అల్ప విషయాలు

డాక్టర్ పూరన్ బాత్రియా

స్వల్ప ప్రాధాన్యం కలవిగా, తేలికగా చూసే జీవిత విషయాలు సంఘంపైన ఆకస్మిక, సుదృఢ ప్రభావంచూపే అవకాశం ఉంది ముఖ్యమైన విషయం కాదనుకున్నది - ఏదో ఒక సమయంలో గొప్ప భాగం పంచుకోవచ్చు

లోకోక్తిలోని చలిచీమ బలవత్తరమైన ఏనుగు చెవిలోకి ప్రవేశించి, దాన్ని చంపవచ్చు ఒక సిగరెట్టుకున్న నిప్పురవ్వ - ఒక భవనంలో అత్యధిక భాగాన్ని అగ్ని ప్రమాదానికి గురిచేయవచ్చు మనసుకు బాధ కలిగించే ఒక మాటను అజాగ్రత్తగా పలకటం - ఇద్దరు గాఢ స్నేహితుల మధ్య ఎడతెగని విరోధం కల్పించవచ్చు

ఒక చెట్టునుంచి ఆపిల్ పడటం న్యూటన్ చూశాడు అతిస్వల్ప ప్రాధాన్యం కల ఈ సంఘటన మానవాళి అభివృద్ధికి అత్యంత



NEWTON

దోహదం చేసే "గురుత్వాకర్షణ సిద్ధాంతం" (law of gravition) కనుగొనేందుకు కారణమయింది "రుబికన్" అనే ఏరు దాటటం జూలియస్ సీజర్‌కు ప్రపంచాన్ని జయించమనే స్ఫూర్తినిచ్చింది అది రోమన్ రిపబ్లిక్‌ను ఒక



JULIUS CAESAR

సామ్రాజ్యంగా మార్చింది ఒక కుష్టువాణ్ణి చూడటం - ఉత్తమ రాజపుత్రుడైన గౌతమబుద్ధుణ్ణి "నిర్వాణ" వేదాంత బోధచేస్తూ భిక్షాటనతో

సరైన కారణం లేకుండా రైలు పెట్టె నుండి బయటికి త్రోయటం వల్ల ఏర్పడిన అవమానం - శాంతి కాముకుడు, నిరాడంబరుడు అయిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీని ఒక తిరుగుబాటు దారునిగా, రాజకీయ ఆందోళన కారునిగా మార్చింది దీనికి బ్రిటిష్ వారు అత్యధిక మూల్యం చెల్లించవలసి వచ్చింది

ఇటువంటి ఉదాహరణలు చరిత్ర నుండి అసంఖ్యాకంగా, అధికంగా తీసి చూపవచ్చు

పెద్ద విషయాల వలెనే జీవితంలో చిన్న విషయాలు కూడా అంతటి ప్రాధాన్యం వహిస్తాయి

అన్ని స్వేచ్ఛలు - మేధా స్వేచ్ఛనుంచే పైకి ఉబికి వస్తాయి"

స్వల్ప విలువలు కల పనులను సరిగా నిర్వర్తించినప్పుడు విధ్వంసక శక్తుల ఆకస్మిక ప్రేలుళ్ళను నిరోధించవచ్చు మనలో చాలా మందికి ఈ నర్సరీ పద్యం పరిచితమైనదే



'ఒక మేకు కోసం పాదరక్ష పోగొట్టుకున్నాము,
పాదరక్ష కోసం అశ్వాన్ని కోల్పోయాము,
అశ్వం కోసం సవారీ చేసేవానిని కోల్పోయాము,




సవారీ చేసే వాని కోసం, యుద్ధంలో ఓడి పోయాము,
యుద్ధం కోసం రాజ్యాన్నే కోల్పోయాము,
ఇదంతా జరిగింది ఒక్క పాదరక్ష మేకు కోసం''

అల్పవిలువ, అల్ప ప్రాధాన్యం అనేది లేనేలేదు అత్యంత గొప్పవి లేదా దృఢమైన ఫలితాలను ఇచ్చేవి - మంచికైనా, చెడుకైనా - అత్యల్ప విషయాలను అనుసరించే రావచ్చు

కవి జూలియా కార్నీ ఇలా సరిగ్గా చెప్పాడు

'అల్ప నీటి బిందువులు
అత్యల్ప ఇసుక రేణువులు
బ్రహ్మాండమైన సముద్రాన్ని
మరియు రమ్యమైన భూమిని
నిర్మిస్తాయి ''



సెకండ్లు నిమిషాలను, నిమిషాలు గంటలను, గంటలు రోజులను, రోజులు సంవత్సరాలను తయారు చేస్తాయి ఒక ఫలవంతమైన జీవితంలో సెకండ్లను తేలికగా, ఆలోచనా రహితంగా వృధా చేయకూడదు ఎవరైతే నిమిషాల పట్ల శ్రద్ధ వహిస్తారో, వారిపట్ల గంటలు తమంతట తామే శ్రద్ధ తీసుకుంటాయి మరోవిధంగా చెప్పాలంటే, మనం అతిస్వల్ప ప్రాధాన్యం కల విషయాల యొక్క ప్రాముఖ్యతను గ్రహించినట్లయితే, మనం ఎటువంటి పనినైనా - అది ప్రత్యేకత కలది కానీ లేదా ఒక నిర్దిష్టమైన విధి అయినవాటికీ - పూర్తి చేయగలుగుతాము

"మీకు పని లేకపోతే పుష్పాల సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ కాలం గడపండి ''
—జపాన్